Photo by A. S. Lakdawala



బహుమతి
పొందిన వ్యాఖ్య

నింగి మబ్బులు కప్పె

పంపినవారు :
ఎం. అప్పారావు - గోపాలపురం

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# "అన్నట్టు నా హెర్క్యులిస్ తాళం వేశానో లేదో చూసుకొని వస్తా"

హెర్క్యులిస్ అతని అమూల్యమైన చరాస్తి

మీరు సైకిలు కొనుక్కోవాలంటే మీరూ మీ వాళ్లూ కూడా అనేక విధాల ఖర్చులు తగ్గించుకోవలసి రావచ్చు–బస్సుల కనండి, కాఫీ ఫలహారాలకనండి, చీరా సారే అనండి, నగా నట్రా అనండి ....

అందుచేత ఆ కొనేదేదో ఉత్తమోత్తమమైనదే కొనాలనిపించడం సహజం. హెర్క్యులిస్ కొనండి. కంటికి ఇంపైన రూపం, ఎదురుగాలిలో కూడా సునాయాసంగా వెళ్లడానికి అనువుగా తీర్చిదిద్దిన రూపురేఖలు, హాయిగా, సాఫీగా సాగిపోయే నడక – ఇవి దీనికి ప్రథమస్థానం సంపాదించిపెట్టాయి. ప్రపంచావధిని 134 పైచిలుకు దేశాల్లో హెర్క్యులిస్‌నే మిగతావాటిమీద ఎన్నిక చేస్తున్నారు.

IWT-TIC 1144a

ఇండియాలో అన్నిటికన్నా పెద్దదైన ఫ్యాక్టరీలో, సర్వాంగ సమగ్రమైన సాధనసంపత్తితో నిర్ణీత ప్రమాణాలకు తూ. చ. తప్పకుండా తయారుచేసిన విభాగాలతో హెర్క్యులిస్ సైకిలు నిర్మించబడుతోంది. "స్ప్రా గ్రేనొ డైజింగ్" పద్ధతిలో తుప్పు పట్టడానికి ఏమాత్రం ఆస్కారం లేకుండా కట్టుదిట్టం చేస్తారు. ఆపైన ముమ్మారు ఎనామెల్ చేయడం వల్ల సైకిలు ధగధగ మెరుస్తూ వుంటుంది.



మీ సైకిలు పెట్టుబడిలాటిది– హెర్క్యులిస్ మీ సొమ్ముకి పూర్తి విలువనిస్తుంది.

# హెర్క్యులిస్

సైకిల్ కంటె ఎక్కువైనది – అది మీ ప్రాణమిత్రుడు

తయారీ:
టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా
అంబత్తూరు – మద్రాసు దగ్గర



విశాలాంధ్ర అంతటా విజయవంతంగా
నడుస్తోంది!

డీలక్స్ ఫిలిమ్స్
సమర్పించు

సదరన్ మూవీస్ వారి

బాగ్దాద్ గజదొంగ

డైరెక్షన్: T.P. సుందరం

STUDIO Aitha

CHITRALEKHA

ఆంధ్ర...గౌతమి పిక్చర్స్ + సీడెడ్...భాస్కర్ పిక్చర్స్ + నైజాం...వాణీ ఫిలింస్.

# ఇప్పుడు

## మీకు ప్రియమైన ఆరోగ్యముచేకూర్చే విటమినులు కలిసిన వాటర్‌బరీస్ కాంపౌండ్ తీసుకోండి

భారత దేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినులు చేర్చబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.




## వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తి చేయును.

దగ్గు, జలుబులకు క్రియోసోట్ మరియు గైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎల్లో లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.



## పేరు చెప్పుకోండి...

పూర్వం ఒక మిల్లు వర్తకుడు. అతడికో కుమార్తె. మంచి అందగత్తె. ఒకరోజు రాజుదగ్గరకు వెళ్ళి తన పిల్ల ఎంతో తెలివైందని ఎండుగడ్డిని బంగారపు పోగులు చేస్తుందని గొప్పలుపోయాడు. రాజు వెంటనే ఎండుగడ్డి పెట్టిన గదిలోకి పిల్లను రప్పించి "ఈ గడ్డిని బంగారంచేస్తే నేను నిన్ను పెళ్లాడతాను చేయలేకపోతే తల కొట్టేస్తాను" అన్నాడు. దిక్కుతోచక వెఱ్ఱిపిల్ల కూర్చుని ఏడుస్తూంది. ఇంతలో ఓ పొట్టివాడొచ్చి "నీ మొదటి కాన్పుబిడ్డను నాకిస్తే నీకు సహాయంచేస్తా"నన్నాడు. సరే అంది వెనుక ముందు ఆలోచించకుండా. మర్నాడు చూస్తే గదంతా బంగారపు పోగులే. రాజు ఎంతో సంతోషించి ఆ పిల్లను రాణీచేశాడు.

కొన్ని ఏళ్లకి రాజకుమారుడు పుట్టాడు. పొట్టాడు రాణీ దగ్గర తయారై వాగ్దానం జ్ఞాపకంచేశాడు. ఏడ్చి మొర పెట్టుకుంది. పొట్టాడు కనికరంతో ఒకరోజులోగా తన పేరు చెప్పుకుంటే బిడ్డను ఇవ్వక్కరలే దన్నాడు. తెల్లవారింది రాణీ ఊహించిన పేర్లు ఒకటీ నిజమవలేదు. తెగించి గదిలోకి పరుగెత్తి సందుకు పెట్టొకటి తెచ్చి పొట్టాడికిచ్చి తెరచి చూడమంది. గునుస్తూ అయిష్టంతో పెట్టెతెరిచాడు— కళ్లు జిగేలుమన్నాయి. "రాణిగారిచ్చిన పారితోషికం అమోఘమైనది. తమ బిడ్డను తమరే ఉంచుకోండి" అని ఐనా పేరు తెలుసుకోవాలంటే "కేనామాగో పమ్మత శాస్త్రీ హ్యాపదా" అని సంతోషంతో సందుకు పట్టుకుపోయాడు.

సందుకులో ఏముందో ఊహించండి .... చెప్పాలా. అందమైన ప్యారీవారి బిళ్లల డబ్బా.




నీతి: ప్యారీవారి Parry's బిళ్లల

## పారితోషికంతో ఎప్పుడూ అందరినీ సంతోషపెట్టవచ్చు

ప్యారీవారి బిళ్లలు రుచికరమైనవి, స్వచ్ఛమైనవి, పుష్టికరమైనవి విడిగా కొనుక్కోవచ్చు లేదా అందమైన ప్యాన్సీడబ్బాలలో కొనవచ్చు.

తయారీ:
ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

# ఇంటికి త్వరగా పోదాము!





ఎందుకంటె, వాళ్ల ఇళ్లయందు, వాళ్లకు ప్రీతైన సాతెవారి బిస్కట్లున్ను చాకొలెట్లున్ను సర్వదా వాళ్లకోసం సిద్ధంగా వుంటాయి. ఈ ప్రీతైన ఆహారము లుండుటచేత వారు తమ అలసటను మరచుటయేగాక సాయంకాలమున ఆటలాడుకొనుటకు చాలాశక్తి వంతంగా వుంటారుకూడా.



## సాతె
బిస్కట్లు & చాకొలెట్లు
















సాతె బిస్కట్ అండ్ చాకొలెట్ కం. లి., పూనా-2

Heros' 120 TEL

"క్షమించాలి, ఒక్క నిమిషము....
నేను గ్లూకో బిస్కట్లను తినేవేళ అయింది"




పార్లేవారి గ్లూకో బిస్కట్లు
బలమును చేకూర్చును

పార్లె ప్రోడక్ట్స్ మ్యాన్యుఫెక్చరింగ్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్. బొంబాయి.24

PP.178A TE EVEREST



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో "గలివర్ యాత్రలు", "మార్కోపోలో" ముగుస్తున్నాయి. పైసంచికలో కొత్త శీర్షికలు ప్రారంభమవు తాయి, వేచి ఉండండి.

"విక్రమోర్వశీయం" అనే కాళిదాసు నాటకం తాలూకు కథను "ఊర్వశీ పురూరవ" అనే పేరుతో ఈ సంచికలో ప్రచురించుతున్నాం.

"క్షీరసాగర మథనం" కూడా ఈ సంచికతో ముగిసింది. పైసంచికలో మరొక చక్కని గేయకథ ప్రారంభిస్తాము. అది కూడా శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారిదే.

మన దేశపు అద్భుతాలు అనే శీర్షికకింద ఈసారి ఢిల్లీలోని ఎర్రకోట గురించి చదువుతారు. దీనికి సంబంధించిన వివరా లకు ఒక పేజీ చాలదు, అందుచేత దానికోసం మూడు పేజీలు ప్రత్యేకించాము.

సంపుటి 27 : డిశంబర్ 1960 : సంచిక 6

CHITRA




దివిటీల కాంతి యుద్ధరంగమంతా నిండి చీకటి పోగానే ఉభయపక్ష యోధులూ విజృంభించి పోరాడసాగారు. ద్రోణుడు గొప్ప యుద్ధం సాగించాడు, కాని కర్ణుడు ద్రోణుణ్ణి మించిపోయాడు. అతని ధాటికి తట్టుకోలేక పాండవ బలాలు పారిపోసాగాయి.

ధర్మరాజు అర్జునుణ్ణి సమీపించి, "చూడు, కర్ణుడు ఎలాటి దారుణ యుద్ధం చేస్తున్నాడో! అతన్ని అడ్డగించే ఉపాయం నువే చూడాలి. ఉపేక్షిస్తే సర్వనాశనం తప్పదు," అన్నాడు.

అర్జునుడు కృష్ణుడి సలహా అడిగాడు. కృష్ణుడు ఇలా చెప్పాడు: "ఈ సమయంలో నీవు కర్ణుణ్ణి ఎదుర్కోవటం క్షేమంకాదు. అతడివద్ద కవచకుండలాలు తీసుకున్నప్పుడు ఇంద్రుడు అతడికి వైజయంతి అనే మహాశక్తిని ఇచ్చాడు. ఆ అస్త్రాన్ని కర్ణుడు నీపై ప్రయోగించటానికే దాచి ఉంచాడు. దానికి తిరుగు లేదు. ఈ తరుణంలో కర్ణుణ్ణి ఎదుర్కోదగినవాడు మన యోధులలో ఘటోత్కచుడు ఒక్కడే కనిపిస్తున్నాడు."

కృష్ణుడు ఘటోత్కచుణ్ణి పిలిపించి, "ఇప్పుడు మన విజయం నీపైనే ఆధారపడిఉన్నది. కర్ణుడు మన సైన్యాలను చించి చెండాడుతున్నాడు. మాయయుద్ధంలో ఆరితేరిన నీవు అతణ్ణి ఎదిరించి జయించాలి. ఇవాళ నీ యుద్ధంతో నీకూ, మాకూకూడా ఖ్యాతి రావాలి," అన్నాడు.

"నీకు భీముడూ, సాత్యకీ తోడుగా వస్తారు," అన్నాడు అర్జునుడు.

"నాకు ఎవరూ తోడు అవసరంలేదు. ఆ ద్రోణకర్ణులను నేనొక్కణ్ణే ఎదిరించి చంపేస్తాను," అంటూ ఘటోత్కచుడు తన బలాలతోసహా యుద్ధంలో ప్రవేశించాడు.

ఘటోత్కచుడు కర్ణుడిపైకి వస్తూ ఉండటం చూసి దుర్యోధనుడు దుశ్శాసను

అట్టమీది బొమ్మ

డితో, "నీవు కర్ణుడికి అండగా వెళ్ళు," అన్నాడు. ఆ సమయానికి జటాసురుడి కొడుకైన అలంబుసుడు దుర్యోధనుణ్ణి సమీపించి, "దుర్యోధన మహారాజా, పాపులైన పాండవులు మహాబలశాలి అయిన నా తండ్రిని చంపేశారు. అందుచేత, నీ అనుమతి అయితే, నేనిప్పుడే వెళ్ళి ఆ పాండవులను చంపి వారి రక్తమాంసాలతో నా తండ్రి ఆత్మను ఆరాధిస్తాను," అన్నాడు.

"అయితే వెళ్ళి ముందు ఆ ఘటోత్కచుణ్ణి చంపు," అన్నాడు దుర్యోధనుడు.



అలంబుసుడు ఘటోత్కచుడిపైకి వెళ్ళాడు. ఇద్దరికీ భీభత్సమైన యుద్ధం జరిగింది. చివరకు ఘటోత్కచుడు అలంబుసుణ్ణి పడదోసి, అతడి తలను కత్తితో కోసి, దాని జుట్టును పట్టుకుని దుర్యోధనుడి వద్దకు వెళ్ళి, "ఇదుగో, చూడు, నీ బంధువు చచ్చాడు. కర్ణుడికీ ఈ గతే పట్టబోతున్నది. రాజునూ, బ్రాహ్మణ్ణీ, స్త్రీనీ చూడబోయేవారు వట్టి చేతులతో పోరాదంటారు గనక నీకోసం ఈ అలంబుసుడి తల తెచ్చాను. కర్ణుడి తల వచ్చేదాకా దీనితో తృప్తిపడు!" అని చెప్పి కర్ణుడిపైకి వెళ్ళాడు.

ఇంతలో అలాయుధుడనే మరొక రాక్షసుడు దుర్యోధనుడి వద్దకు వచ్చి, "దుర్యోధనా, బకాసురుడు నాకు జ్ఞాతి. బకాసురుడితోబాటు కిమ్మీరుడూ, హిడింబుడూ కూడా భీముడి చేతిలో చచ్చారని నీకు తెలుసు గదా. నేను భీముణ్ణీ, ఘటోత్కచుణ్ణీ కూడా చంపేస్తాను. మీ సైన్యాలను ఆగమని చెప్పు!" అన్నాడు.

దుర్యోధనుడు సంతోషించి, "మీరు యుద్ధం చెయ్యండి. మీ బలాల వెనకగా మేమూ యుద్ధం చేస్తాం," అన్నాడు.

అలాయుధుడు వెళ్ళి భీముడితో తలపడ్డాడు. వాడు మహా బలశాలి, భీముణ్ణి కూడా చాలా చిక్కులో పెట్టాడు. అది చూసి కృష్ణుడు, కర్ణుడిపైకి కొందరు పాండవ

యోధులను పంపి ఘటోత్కచుడు అలాయుధుడితో తలపడే అవకాశం కల్పించాడు. ఇద్దరు రాక్షసులకూ భీకరమైన యుద్ధం జరిగింది. చిట్టచివరకు ఘటోత్కచుడు అలాయుధుడి తల నరికి, దాన్ని దుర్యోధనుడి ముందు పడేటట్టు గిరవాటువేశాడు.

ఆ తరవాత ఘటోత్కచుడు విజృంభించి యుద్ధంచేస్తూ కౌరవసైన్యాన్నీ, ధృతరాష్ట్రుడి కొడుకులనూ ఎడా పెడా నాశనం చేయసాగాడు.

అదిచూసి కౌరవులు కర్ణుణ్ణి సమీపించి, "కర్ణా, ఎలాగైనా నీవు ఈ ఘటోత్కచుణ్ణి చంపు. వీడు మమ్మల్ని బతకనిచ్చేటట్టు లేడు. అర్జునుణ్ణయినా చంపగలం గాని ఈ ఘటోత్కచుణ్ణి ఎదుర్కోవటం మా తరం కావటంలేదు. నీ దగ్గిర ఇంద్రుడిచ్చిన శక్తి ఉన్నది. దాన్ని ప్రయోగించినట్టయితే ఈ రాక్షసుడు ముందు చస్తాడు. వీడు చావకపోతే మా చావు నిజం," అన్నారు.

కౌరవుల దుస్థితి చూసి కర్ణుడు తన వైజయంతిని ఘటోత్కచుడిపై ప్రయోగించాడు. దాని దెబ్బకు ఘటోత్కచుడు ప్రాణాలు వదిలాడు. ఘటోత్కచుడి చావుకు పాండవులు కన్నీరు కార్చారు. ఒక్క కృష్ణుడే సంతోషించాడు. అర్జునుడు విచారపూర్వకంగా కృష్ణుడితో, "మనకు ఇంత నష్టం జరిగిందిగదా, నీవు ఎలా ఆనందించ గలుగుతున్నావు?" అన్నాడు.

"అర్జునా, ఇప్పుడు నా మనసు కెంత హాయిగా ఉన్నదో నీకు తెలియదు. కర్ణుడి పద్ద ఉన్న ఆ మహాశక్తి ఘటోత్కచుడిపైన వ్యర్థమైపోయింది. ఇక కర్ణుడు చచ్చినవాడి కిందనే లెక్క. ఇప్పటికైనా అతడు నీచేత తప్ప మరొకరిచేత చావడు. మహాశక్తి ఉండగా నీవుకూడా అతన్ని చంపలేకపోయి ఉందువు. నీకోసమే నేను బుద్ధిపూర్వకంగా ఘటోత్కచుడి చావు తెచ్చిపెట్టాను. తెలుసుకో!" అన్నాడు కృష్ణుడు అర్జునుడితో.





# క్షీరసాగర మథనము

షష్ఠాశ్వాసము:

ఇంద్రుడపుడు బలిచెంతకు
ఏగి సర్వ మెఱిగించెను;
అమృత భాగ మేర్పఱుపగ
అత డచ్చటి కరుదెంచెను.

బలిని చూసి దైతేయులు
భయముచెంది, అమృతకలశ
మతని కిచ్చి, పడి మ్రొక్కరి;
అచ్చరలను మ్రొక్కించిరి.

అంతలోన ఒక జవ్వని
వింత హొయలు చూపించుచు,
దైత్యరాజు సమ్ముఖమున
నృత్యమాడ దొడగినయది.

తకధిమ్మని వాద్యములవి
తామంతట మ్రోసినయవి;
ఆమె అంద చందమ్ములు
మైమఱవగ జేసినయవి.

అప్సరసలు సిగ్గుపడుచు,
ఆమెతోడ తాముగూడ
గజ్జెలు ఘులుఘుల్లనంగ,
కాళ్ళు కదిపి నర్తించిరి.

దైత్యరాజు కొలువెల్లెడ
నృత్యమ్ములు చెలరేగెను;
కులుకులాడి కనుసైగల
కొలు వపు డుఱ్ఱూట్లూగెను.

ఆ తొయ్యలి తము జూచిన
దైతేయులు గర్వించిరి;
ఆ మోహిని తము గాంచిన
ఆదిత్యులు తల వంచిరి.

అంతట బలి చక్రవర్తి
ఆ మోహినితో ఇట్లనె:
"ఎవ్వతెవో ఎల జవ్వని!
ఎంతో చక్కనిదానవు!

ఉత్పల సత్యనారాయణాచార్య

ఇంపగు నీ చేతులతో
ఈ యమృతము త్రాగవలయు!
నీ చేతుల పోసినయది
నీరైనను అమృతమగును!"

అని వేడుకతోడ పలికి
ఆదిత్యుల, దైతేయుల
బారులుగా కూర్చొనుడని,
బలి భూపతి అనతిచ్చె.

అమృతము గల స్వర్ణకలశ
మామె చేతి కత డిచ్చెను;
అయమ చిఱునవ్వులతో
అద్దానిని పుచ్చుకొనెను.

కలశము నఱచేతబట్టి,
కులుకు లొలకపోసికొనుచు,
దేవ దైత్యు లున్నయెడకఱ
తీగబోణి అరుదెంచెను.

రక్కసులను గని ఎంతో
మక్కువ చూపించె నామె;
ఆమె తళుకు బెళుకులు కని
మైమఱచిరి వారెల్లరు.

అయమ తామున్నయెడకు
అరుదెంచిన ఉప్పొంగుచు,
అడియాసలతో దైత్యులు
అమృతమడుగ మఱచినారు.

"చావులేని మం దియ్యది,
త్రావుండో దనుజులార!"
అని ఆడుచు అమృతమామె
అదిత్యులకే పోసెను.

"తడవుసేయ వల, దమృతము
త్రాగుండో దైత్యులార!"
అని పాడుచు అమృతమామె
ఆదిత్యులకే పోసెను.

శ్రీహరి తమ కమృతమొసగ
మోహినిగా విచ్చేసెను,
అని తలచుచు ఆదిత్యులు
అమృతమాన దొడగినారు.



రక్కసులా సఖిని చూచి
గ్రుక్కిళ్ళను మ్రింగినారు;
దేవతలా అమృతమ్మును
తృప్తితీర త్రాగినారు.

రాహువనెడు దనుజుడొకడు
మోహిని మోసమ్ము నెఱిగి,
ఆదిత్యుల పంక్తిజేరి,
అమృతమ్మును త్రాగినాడు.

అంతలోన సూర్యచంద్రు
లది తెలుపగ, ఆ దైత్యుని
వేయంచుల చక్రమొకటి
వెడలివచ్చి తెగటార్చెను.

రక్కసు డిరుతుండెములై,
రాహు కేతువులుగ మాఱి,
సూర్యచంద్రులను మ్రింగగ
చొరబాఱెను వినువీధికి.

అపుడపుడే కారుమబ్బు
అవరించె నాకసమున;
పెను చీకటు లలముకొనెను,
ఫెళఫెళమని ఉఱుములుఱిమె

అంతలోన ఆ మోహిని
అమృతకలశ మింద్రునకిడి,
మెఱపు మెఱసి పోయినట్లు
సరగున మటుమాయమయ్యె.

"మోహిని ఏ దమృత మేది?
మోసమయ్యె,"నని దైత్యులు
ఆగ్రహమున గదలనెత్తి
ఆదిత్యులపై దూకిరి.

వజ్రదంష్ట్ర, కాలనాభ
వైరోచన దైతేయులు
ఖడ్గములను ఝళిపించుచు
కదనరంగమున దూకిరి.

అమృతముచే బలమొందిన
ఆదిత్యులు దైత్యులతో
తలపడి ఎదిరించినారు,
తమ శక్తిని చూపినారు.



ఐరావత మింద్రుడెక్కి
వైరోచను తాకినాడు.
ఆదిత్యులు దైత్యులపై
అమ్ములు గుప్పించినారు.

కోపముతో దైతేయులు
కొండలెత్తి విసరినారు;
వజ్రాయుధ మింద్రుడేసి
వైరుల నుగ్గాడినాడు.

రణరంగమునం దసురుల
రక్తము మడుగులు కట్టెను!
రాబందులు పీనుగలపై
రచ్చసేయ సమకట్టెను!

చాలమంది తమవారలు
చచ్చుట గని, దైతేయులు
సడి చప్పుడు లేకుండగ
సంద్రములో దాగుకొనిరి.

బలి యించుక దుఃఖింపక
పట్టణమున కేగినాడు;
"సిరి యెంతయు అస్థిర"మని
చింతించుట మానినాడు.

ఐరావత, ముచ్చైశ్శ్రవ,
మప్సరసల, నమృతకలశ
కల్పతరుల గొని ఇంద్రుడు
కదలినాడు స్వర్గమునకు.

అతనివెంట వాసుకియును
అరుదెంచెను స్వర్గమునకు;
అమృతము కాపాడు భార
మతని కిచ్చె దేవేంద్రుడు.

ఐరావత మింద్రుడెక్కి
అమరావతి నూరేగెను;
స్వర్గలోకమం దప్పుడు
జయభేరులు చెలరేగెను!

★ సంపూర్ణం ★






## 12

[నాగవర్మ కపిలపురం కోటలో తన సైన్యాన్నంతా పోగొట్టుకుని, మారువేషంతో, జ్వాలా ద్వీపపు పులిరాయుళ్ల నాయకుడైన కరవీరుడితో కలిసి అడవిలోకి పారిపోయాడు. తరవాత రాకుమారి కాంతిమతికీ, చిత్రసేనుడికీ వివాహం అయింది. వివాహంనాడు ఉగ్రాక్షుడి కొత్తకోరికను నెరవేర్చేందుకు చిత్రసేనుడు అంగీకరించాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లకోసం కేక వేయగానే, కోటలో ఎక్కడెక్కడ వున్న రాక్షసులూ అతడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చారు. ఉగ్రాక్షుడు వారందరినీ చిత్ర సేనుడికి చూపుతూ, "మహారాజా, మీరు ఏక్షణాన ఎలాంటి సహాయం కావాలన్నా, నేనూ వీళ్ళూ రాగలం. మీరు నా కోటకు కాకితో కబురంపితే చాలు," అన్నాడు.

చిత్రసేనుడు చిరునవ్వు నవ్వాడు. "నీనుంచిగానీ, నీ బంట్లనుంచిగాని ఏ మాత్రం సహాయం కోరే అవసరం లేకుండా, నా రాజ్యపాలన ప్రశాంతంగా జరిగిపోవా లన్నదే నాకోర్కె. అడవిలో ఎక్కడో మాయ మైన ద్రోహి నాగవర్మనూ, అతని అను చరుడు కరవీరుణ్ణీ, నీ బంట్లు పట్టుకు రాగలిగితే బావుండును. నాకూ, నీకూకూడా ఏనాటికైనా ప్రమాదం అంటూ కలిగితే— వాళ్లిద్దరి నుంచే," అన్నాడు చిత్రసేనుడు.

"మహారాజా, వాళ్లు ప్రస్తుతానికి అయిపూ అజా లేకుండా మాయమయారు.





మానమే బాధిస్తున్నది. ఉగ్రాక్షుడు అడవి లోని తన కోటకు ప్రయాణమయాడు.

రెండు మూడు నెలలు గడిచినై. ఉన్నట్టుండి హఠాత్తుగా రాజ్యంలో అక్కడా యిక్కడా దారిదోపిళ్లూ, గృహదహనాలూ ప్రారంభమయినట్టు చిత్రసేనుడికి వేగుల ద్వారా వార్తలు అందినై. ఈ దోపిళ్లు చేసే వాళ్లు సుశిక్షితులూ, అన్నింటికీ తెగించిన పరమ దుష్టులనికూడా తెలిసింది. వాళ్లు అడవిదారుల పక్కనా, కొండకోనల్లోనూ దాగివుండి, హఠాత్తుగా బాటసారులమీదా, గ్రామాలమీదా పడి నానాభీభత్సం కలిగించి, దొరికినదల్లా దోచుకుని పారిపోతున్నారు. తమను ఎదిరించినవాళ్లనూ, వాళ్ల గ్రామాలనూ నిలువునా కాల్చేస్తున్నారు. ఇంతవరకూ ఈ దుర్మార్గుల్లో ఒక్కగానొక్కడైనా ప్రాణాలతో పట్టుబడలేదు. ఏ ఒకడైనా గాయపడిగాని, లేక గుంపునుంచి వేరైగాని దొరికినా, వాడు వెంటనే ఏదో విషం మింగి ప్రాణాలు విడుస్తున్నాడు. ఆ కారణంగా, ఆ దోపిడీగాళ్లను ప్రశ్నించి వాళ్ల నాయకుడెవడో, వాళ్ల నివాసస్థానాలెక్కడెక్కడ వున్నవో తెలుసుకునేందుకు సాధ్యంకాలేదు.

చిత్రసేనుడు ఒక పని చేశాడు: ఆయన తన మనుషులను రాజ్యంలోని గ్రామా

కాని, వాళ్లు ఎంతోకాలం ఈ అడవుల్లో కొండల్లో దాగివుండలేరని నానమ్మకం. ఈ నాటినుంచి నా సేవకుల్లో సగంమందికి వాళ్లను వెతికిపట్టుకునే పని ఒప్పచెపుతున్నాను," అన్నాడు ఉగ్రాక్షుడు.

చిత్రసేనుడి పక్షాన చేరిన పులిరాయుడు అమరపాలుడికి ఆ ద్రోహులిద్దరూ ప్రాణాలతో దొరుకుతారన్న నమ్మకం పోయింది. అతడు నిరాశగా తల వూపుతూ, "మహారాజా, వాళ్లు ఈసరికే తూర్పుసముద్రంలో వున్న జ్వాలాద్వీపానికి ప్రయాణం కడుతూండివుంటారని నా అనుమానం," అన్నాడు. చిత్రసేనుణ్ణికూడా అలాంటి అను





లకూ, అడవుల మధ్య వుండే గూడేలకూ పంపి ; ఇప్పటివరకూ బందిపోట్లుగానూ, దారిదోపిడిగాళ్లుగానూ వున్న వ్యక్తులందరూ క్షమించబడతారనీ, వాళ్లు తమతమ ఆయుధాలతో కపిలపురానికి వస్తే, ప్రతిఒక్కరికీ వ్యవసాయయోగ్యమైన భూములు యివ్వబడతవని చాటింపు వేయించాడు.

చిత్రసేనుడి ఈ ఎత్తుగడ పారింది. వారం తిరక్కుండానే దాదాపు యాభైమంది బందిపోట్లు కత్తులూ, కఠార్లతో కపిలపురానికి వచ్చారు. వాళ్లందరూ భవనంముందున్న ఆవరణలో పోగవగానే, చిత్రసేనుడు తను కొత్తగా నియమించిన సేనానాయకుడు అమరపాలుడితో వాళ్లదగ్గిరకు వచ్చాడు. బందిపోట్లను చూస్తూనే అమరపాలుడు వాళ్లల్లో కొందరిని గుర్తించి, చిత్రసేనుడితో, "మహారాజా, వీళ్లల్లో కొందరైనా ద్రోహి నాగవర్మ సైనికులున్నారు. వీళ్లను నమ్మి మడిమాన్యాలు యివ్వటం ప్రమాదం అవుతుందేమో," అన్నాడు.

"మీ నాయకుడు నాగవర్మ ఎక్కడ? అతడే మిమ్మల్ని పంపాడా?" అని అడిగాడు చిత్రసేనుడు బందిపోట్లను.

"మాకు ఒక నాయకుడంటూ లేడు, మహారాజా. మీరు అనుమానపడ్డట్టు మేము ఒకప్పుడు నాగవర్మకింద పనిచేసినవాళ్లమే కాని, ఈ కోటలో మీరు మాటువేసి మా మీదకు రాక్షసుల్ని వదిలినప్పుడు మేము తలా ఒక దారీ అయాం. ఆ నాటినుంచి యీనాటివరకూ ఆ నాగవర్మ ఏమయాడో, ఎక్కడ వున్నాడో మాకు తెలీదు," అన్నాడు బందిపోట్లకు నాయకుడైన ఒకడు.

"మీ మాటలు నమ్మటం ఎలా?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

"మీ చాటింపు విని, మీకు లొంగిపోయి, రాజభక్తి గల పౌరులుగా జీవించేందుకు అవకాశం కలుగుతుందని యిక్కడికి వచ్చాం. కేవలం పొట్టకోసమే మేము దోపిడీ





లకూ, దొంగతనాలకూ పాల్పడ్డాం. మా నేరాలు క్షమించి మమ్మల్ని మీ పౌరులుగా స్వీకరించాలని కోరుతున్నాం," అన్నాడు బందిపోట్ల నాయకుడు.

"సరే, మీ మాటలు నమ్మి మీకు సేద్యానికి పొలాలు యిస్తాను, కాని మీరు యాభై మందికన్న ఎక్కువ వున్నట్టులేదు. తతిమ్మా దొంగల మాటేమిటి?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

"మమ్మల్ని మీరు క్షమించి, దయగా చూశారని తెలియగానే ఆ మిగిలినవాళ్లూ మీ శరణు జొచ్చేందుకు వస్తారు, మహా రాజా!" అన్నాడు బందిపోట్ల నాయకుడు.

అమరపాలుడు, చిత్రసేనుడి చెవిలో రహస్యంగా, "మహారాజా, వీళ్ల మాటలు నమ్మేందుకు లేదు. ద్రోహి నాగవర్మ వెనక వుండి వీళ్లచేత యీ నాటకమంతా ఆడిస్తున్నాడో లేదో మనం తెలుసుకునేవరకూ వీళ్లను కారాగారంలో బంధించి వుంచటం బావుంటుందనుకుంటాను," అన్నాడు.

"అది సాధ్యంకాదు. నేను మాట తప్పినట్టవుతుంది. ఆతరవాత ప్రజల్లో నా వాగ్దానాలకు విలువేం వుంటుంది?" అన్నాడు చిత్రసేనుడు.

"అయితే మీరో క్షణం ఆగండి. వీళ్లకో చిన్న బెదురు పెట్టి చూస్తాను," అంటూ అమరపాలుడు బందిపోట్లకేసి తిరిగి, "మీలో కొందరికైనా నాగవర్మా, జ్వాలాద్వీపపు పులిరాయుళ్ల నాయకుడు కరవీరుడూ ఎక్కడ వున్నదీ తెలుసునని మహారాజుగారి అభిప్రాయం. మీరు నిజం బయటపెట్టక పోయారో, చిత్రవధ చేయించుతారు," అన్నాడు కఠినంగా.

అమరపాలుడు యిలా అనగానే బందిపోట్ల నాయకుడు గుప్పెట ముందుకు చాచాడు. అతడితోపాటు అతడి అనుచరులు కూడా గుప్పెట్లు చాచారు. బందిపోట్ల నాయకుడు దృఢమైన కంఠస్వరంతో, "మహా





రాజా! మేము మేలుకూ కీడుకూ్కడా సిద్ధపడే యిక్కడికి వచ్చాం. ఇదిగో, మా గుప్పెటలకేసి చూడండి. ఇందులో చిటికెల మీద ప్రాణంతీసే కాలకూటవిషం వున్నది.. మీ సైనికులు మాదరికి వచ్చేలోపలే, మేం యీ విషం మింగి మరణించగలం. మరో సారి ప్రమాణంచేసి చెపుతున్నాను. ఆ నాగ వర్మ గురించిగానీ, కరవీరుణ్ణి గురించిగానీ మాకేమీ తెలియదు," అన్నాడు.

బందిపోట్ల నాయకుడు అలా అనగానే చిత్రసేనుడికీ, అమరపాలుడికీకూడా అతడి మాటల్లో నమ్మకం కలిగింది. చిత్రసేనుడు బందిపోట్లకేసి చిరునవ్వు నవ్వుతూ, "సరే, ఈనాటినుంచి మీరు రాజ్యంలోని తక్కిన వారితోపాటు అన్ని హక్కులూ గల పౌరులు. మీకు ఈ రాజధాని నగరం దాపులనే వ్యవసాయయోగ్యమైన భూములు ఇప్పిస్తాను," అన్నాడు. చిత్రసేనుడు ఇలా అనగానే బందిపోట్లనుంచి ఒక్కసారిగా జయజయ ధ్వానాలు వినిపించినై. "చిత్రసేన మహారాజుకూ, జై!" అంటూ వాళ్లు దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేశారు.

తమతోటి బందిపోట్లను చిత్రసేన మహారాజు శిక్షించలేదనీ, వాళ్లకు భూములు యివ్వటం జరిగిందనీ తెలియగానే, రాజ్యం




లోని బందిపోటు ముఠాలన్నీ కపిలపురం వచ్చి రాజుగారికి లొంగిపోయాయి.

చిత్రసేనుడికి యిక తన పరిపాలన ఏ ఒడుదుడుకుల్లేకుండా సాగిపోతుందన్న నమ్మకం కలిగింది. కాని, అతడి కప్పుడప్పుడు ద్రోహి నాగవర్మ ఏమయాడు? ఇంకా బతికే వున్నాడా? వుంటే ఎక్కడ వున్నట్టు? అన్న అనుమానాలు కలుగుతూండేవి. అమరపాలుడుమాత్రం, నాగవర్మ, కరవీరుడితో కలిసి జ్వాలాద్వీపం వెళ్లి వుంటాడని చెపుతూండేవాడు. అలా జరిగి వుంటే, ఏదో ఒకనాడు వాళ్లు తిరిగీ భయంకర పక్షులతో రాజ్యంమీద ప్రత్యక్షమవుతారు.




ఇలాంటి చిన్న చిన్న భయాందోళనలతో వున్న చిత్రసేనుడు తన భార్య గర్భవతి అయినదని తెలిసినప్పుడు మరింతగా ఆందోళన పడ్డాడు. ఆ పుట్టబోయే శిశువు మగపిల్లవాడైనా, ఆడపిల్లఅయినా, అయిదేళ్లు పెంచి రాక్షసుడైన ఉగ్రాక్షుడిపరం చెయ్యాలి.

నెలలు గడిచాయి. రాణి కాంతిమతి ఒకనాటి సూర్యోదయంవేళ ఒక మగపిల్లవాణ్ణి కన్నది. రాజ్యంలో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. ప్రజలు ఉత్సవాలు చేసుకున్నారు. ఆ ఉత్సవాల నడుమ ఉగ్రాక్షుడు రాజప్రాసాదానికి వచ్చి, పొత్తిళ్లలో వున్న రాజకుమారుణ్ణి అంత ఎడంలో నిలబడి



చూసి, చిన్న పిల్లవాడిలా కేరింతలు కొడుతూ గంతులు వేశాడు.

"మహారాజా, ఈనాటినుంచి అయిదేళ్లు ముగియగానే, ఈ పిల్లవాడు నావాడవుతాడు," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఏళ్లు గడుస్తున్నై. కపిలపుర రాజ్యంలో రాత్రివేళల అక్కడక్కడా ఆకాశంలో ఎగిరే మంటలు కనిపిస్తున్నవనీ, అవి అగ్నిపక్షులేననీ ప్రజలు చెప్పుకోసాగారు. క్రమంగా యీ వార్తలు చిత్రసేనుడికి అందినై. రాజ్యంలో నలుమూలల వున్న వేగులవాళ్లు, ఆ ఎగిరేవి అగ్నిపక్షులేనని ధృవపరిచారు.

ఇదో కొత్త బెడద, అనుకున్నాడు చిత్రసేనుడు. ఇంతలో రాకుమారుడికి అయిదేళ్లు నిండినై. ఒకనాటి ఉదయం ఉగ్రాక్షుడు తుఫానులా రాజప్రాసాదం ముందుకు వచ్చి పడ్డాడు.

"మహారాజా, వచ్చాను! ఏడీ రాకుమారుడు?" అని అడిగాడు రాక్షసుడు.

"ఇప్పుడే వస్తున్నాడు, కొత్త దుస్తులూ అవీ....అలంకరిస్తున్నారు, అగు!" అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడి ముఖంలో ఏమాత్రం విచార ఛాయలు లేకపోవటం చూసి, ఉగ్రాక్షుడు



ఆశ్చర్యపడ్డాడు. తన ప్రథమ సంతానాన్ని యింత నిర్వికారంగా అతడు తనపరం చేస్తున్నాడేం? కుర్రవాడు కుంటిగాని, గుడ్డిగాని కాదుగదా?

ఉగ్రాక్షుడు యిలా ఆలోచిస్తున్నంతలో దాసీలు పుష్టిగా, ఆరోగ్యంగా వున్న ఒక కుర్రవాణ్ణి తెచ్చి, ఉగ్రాక్షుడి ముందు నిలబెట్టారు. ఉగ్రాక్షుడు ఆ కుర్రవాణ్ణి చూసి ఉత్సాహంగా చప్పట్లు చరిచి, రెండు చేతులతో పట్టి భుజంమీదికి ఎత్తుకుంటూ, "మహారాజా, మీరు అన్న మాటమీద నిలబడ్డారు. మీ మేలు మరవను," అంటూ కోటద్వారం దాటి అడవిలో ప్రవేశించాడు.

ఉగ్రాక్షుడు అడవి చేరగానే, అతడి భుజంమీద వున్న కుర్రవాడు, "అయ్యా, అయ్యా, ఆ చెట్టుకింద వున్న ఎండు కర్రపుల్ల నాక్కావాలే!" అని మారాం చేశాడు.

ఉగ్రాక్షుడు భుజంమీదినుంచి కుర్రవాణ్ణి దించి, కర్రపుల్ల తెచ్చి అతడి కిస్తూ, "ఈ కర్రతో ఏం చేస్తావు, బాబూ?" అని ముద్దుగా అడిగాడు.

"వంటింటోకి కుక్కలూ, కోళ్లూ రాకుండా తరుముతాను," అన్నాడు కుర్రవాడు.

ఉగ్రాక్షుడు ఉలిక్కిపడ్డాడు. రాజకుమారుడు వంటింటోకి కుక్కలూ, కోళ్లూ రాకుండా తరమటం ఏమిటి?

"మీ అయ్య ఏం చేస్తూంటాడురా, బాబూ?" అని అడిగాడతడు.

"వంటింటో మాంసం, అన్నం వండుతుంటాడు. ఏదైనా కుక్క మాంసం ఎత్తుకుపోయేందుకు వచ్చిందో, ఈ కర్రతో నడుం యిరగేస్తాను," అన్నాడు కుర్రవాడు.

"ఇంత మోసమా, హుం! వంటవాడి కొడుకును, రాజకుమారుడని నాకిస్తారా?" అంటూ ఉగ్రాక్షుడు రౌద్రరూపం దాల్చి, కుర్రవాణ్ణి భుజాన వేసుకుని హుంకరిస్తూ, కపిలపురం కోటకు బయలుదేరాడు.

—(ఇంకా వుంది)






# ఊర్వశీ పురూరవ

ఒకనాడు రంభా ఊర్వశీ మొదలైన అప్స రసలు కుబేరుడి పట్టణమైన అలకా పురానికి వెళ్లి తిరిగి వస్తూండగా హిరణ్య పురంలో ఉండే కేశి అనే రాక్షసుడు హేమ కూట పర్వతప్రాంతంలో వారిని అడ్డగించి, ఊర్వశినీ, ఆమె చెలికత్తె అయిన చిత్రలేఖ అనేదాన్నీ పట్టుకుని ఈశాన్య దిక్కుగా వెళ్లిపోయాడు.

వెంటనే రంభ మొదలైనవాళ్లు గొంతు లెత్తి, "అయ్యయ్యో, కాపాడండి! రక్షిం చండి!" అని కేకలు పెట్టారు.

ఈ కేకలు పురూరవ చక్రవర్తికి విని పించాయి. ఆయన ప్రతిష్ఠానపురానికి రాజు. గొప్ప యోధుడు. ఇంద్రుడికే ఎన్నోసార్లు యుద్ధాలలో తోడ్పడి ఆయన స్నేహం సంపాదించుకున్నవాడు. అయన ప్రాతః కాల నిష్ఠలు ముగించుకుని నగరానికి తిరిగి వెళుతూ రంభ మొదలైనవారు చేసిన ఆర్తనాదాలు విని, వారిని సమీపించి జరిగిన సంగతి తెలుసుకుని, "మీరేమీ భయపడ కండి. మీ స్నేహితురాలిని నేను తీసుకు వస్తాను!" అని వారికి ధైర్యం చెప్పాడు.

తరవాత పురూరవుడు సోమదత్తమనే రథమెక్కి తానుకూడా ఈశాన్య దిక్కుగా బయలుదేరాడు.

రంభ మొదలైనవారు హేమకూట పర్వతం మీదికెక్కి వేచి ఉన్నారు.

పురూరవుడు ఒక్క వాయువ్యాస్త్రంతో కేశి సైన్యాన్ని చెల్లాచెదరు చేసి, ఊర్వశీ చిత్రలేఖలను రక్షించి తన రథంపై ఎక్కించుకుని తిరిగి రాసాగాడు.

కేశిచేత చిక్కి భయంతో మూర్ఛపోయిన ఊర్వశికి ఇప్పుడు స్పృహ వచ్చింది. తనను రక్షించినవాడు పురూరవుడని ఆమె తెలుసు కున్నది. ఆ సమయంలోనే పురూరవుడికీ ఊర్వశికీ పరస్పరం ప్రేమ అంకురించింది.

కాళిదాసు నాటక కథ



వచ్చే రథంమీద జింక చిహ్నం చూసి పురూరవుడు విజయుడై వస్తున్నాడని రంభ మొదలైన అప్సరసలు తెలుసుకున్నారు. ఊర్వశీ రంభా మొదలైనవారు తిరిగి కలుసుకుని పొందిన సంతోషానికి మేరలేదు. వారు పురూరవుడి సహాయాన్ని ఎంతో కొనియాడారు: "నేను చేసినదేమీ లేదు. అంతా ఆ ఇంద్రుడి చలవ!" అన్నాడు పురూరవుడు.

ఈలోపుగా నారదుడు ఇంద్రుడికి ఊర్వశిని కేశి పట్టుకుపోయిన వార్త తెలిపాడు. ఇంద్రుడు చిత్రరథుడనే గంధర్వుణ్ణి పిలిచి, "ఊర్వశి చాలా పిరికిది. ఆమెను కేశి బారినుండి రక్షించి తీసుకురా," అని చెప్పాడు.

చిత్రరథుడు గంధర్వుల సేనతో వస్తూండగా, దారిలో చారణులు కొందరు కనిపించి, "పురూరవుడు ఊర్వశిని రక్షించి తెచ్చాడు. అప్సరసలందరూ ఆయనతోబాటు హేమకూట పర్వతంమీద ఉన్నారు," అని అతడికి చెప్పారు.

చిత్రరథుడు అక్కడికి చేరి పురూరవుడితో, "మహానుభావా, పూర్వం నారాయణముని అప్సరస లందరినీ సౌందర్యంలో మించేదిగా ఉండేలాగు ఈ ఊర్వశిని సృష్టించి ఇంద్రుడికి ఇచ్చాడు. ఇప్పుడు మళ్ళీ మీరు ఆమెను కాపాడి ఇంద్రుడికి ఇచ్చారు. అందుచేత మీరుకూడా మావెంట స్వర్గానికి వచ్చి ఇంద్రుడి కృతజ్ఞతలు అందుకోండి," అన్నాడు.

కాని పురూరవుడు తనకు నగరంలో పని ఉన్నదనీ, ప్రస్తుతానికి స్వర్గానికి వచ్చే అవకాశం లేదనీ చెప్పాడు. పురూరవుణ్ణి వదిలి వెళ్ళటం ఊర్వశికి చాలా బాధ అయింది. ఆమె స్వయంగా ఆయనవద్ద సెలవు పుచ్చుకోలేక తన చెలికత్తె అయిన చిత్రలేఖచేత చెప్పించింది. "మంచిది, వెళ్ళిరండి. నన్నుమాత్రం మరిచిపోవద్దు!" అన్నాడు పురూరవుడు. స్వర్గవాసులు కనుచూపుమేర దాటిపోయినదాకా అక్కడే నిల

బడి తరవాత ఆయన ప్రతిష్ఠాన పురానికి వెళ్ళిపోయాడు.

పురూరవుడు ఊర్వశిమీద ప్రేమచేత చాలా గొప్ప వేదన అనుభవించసాగాడు. ఆయనవద్ద మాణవకుడనే వేడుక చెలికాడున్నాడు. పురూరవుడు తన ప్రేమ గురించి అతడితో చెప్పుకున్నాడు. ఇది రహస్యం గనక మాణవకుడు ఎవరితోనూ చెప్పక దాచిఉంచాడు.

తన భర్త ఏదో రహస్యబాధ అనుభవిస్తున్నట్టు పురూరవుడి పట్టపురాణి కాశికాదేవి ఊహించింది. ఆమె తన పరిచారిక అయిన నిపుణికను పిలిచి, రాజుగారి ఆవేదనకు గల కారణమేమిటో తెలుసుకురమ్మన్నది.

నిపుణిక పేరుకు తగ్గట్టే చాలా గడుసుది. అది ఒంటరిగా కూర్చుని ఉన్న మాణవకుడి వద్దకు వచ్చి, "రాణిగారు నన్ను నీ దగ్గిరికి పంపారు," అన్నది. నిపుణికను చూస్తూనే మాణవకుడు, "దీని దగ్గిర చాలా జాగ్రత్తగా మాట్లాడాలి," అనుకున్నాడు. అతడు ఆమెతో, "రాణిగారి ఆజ్ఞ ఏమిటి?" అన్నాడు.

"'నాకు ఇంత దుఃఖం కలుగుతూంటే నువు చూస్తూ ఊరుకోవటం భావ్యమేనా?' అని రాణిగారు నీతో అనమన్నారు!" అన్నది నిపుణిక.



"ఆవిడగారికి రాజుగారేమైనా అన్యాయం చేశారా?" అని మాణవకుడు అడిగాడు.

"అన్యాయం కాదా? రాజుగారు రాణిగారిని సంబోధించబోయి తాను ప్రేమిస్తున్న దానిపేరు పెట్టి పిలిచారు!" అన్నది నిపుణిక.

పాపం, రాజుగారు తన గుట్టు తానే బయట పెట్టుకున్నాడే అనుకుంటూ మాణవకుడు, "ఊర్వశీ అని పిలిచారేం? ఆ ఊర్వశిని ఏవేళ చూశారోగాని, ఆ క్షణం నుంచీ ఆయనకు వెర్రి పట్టింది. ఒకవంక రాణిగారికి దుఃఖం కలిగించటం అటుంచి, నా ప్రాణాలుకూడా కొరుక్కుతింటున్నారు!" అని గుట్టంతా బట్టబయలు చేసేశాడు.



నిపుణిక నిపుణతతో తన పని పూర్తి చేసుకుని వెళ్లి కాశికాదేవితో అంతా చెప్పేసింది.

"ఎప్పుడెప్పుడు ఏమేమి జరిగేదీ తెలుసుకుని నాకు వచ్చి చెబుతూండు!" అని రాణి తన దాసీని హెచ్చరించింది.

రాజుగారు తన వేడుక చెలికాణ్ణి పిలిచి, "నేనీ విరహబాధ భరించలేకుండా ఉన్నాను. ఎక్కడికి పోతే ఈ బాధ తగ్గుతుందో చెప్పు," అని అడిగాడు.

"వంటఇంటికి పోయి హాయిగా భోంచేస్తే అన్ని బాధలూ తీరుతాయి," అన్నాడు హాస్యగాడైన మాణవకుడు.

"నువు తిండిపోతువు గనక నీ బాధ సులువుగా తీరుతుంది. ఊర్వశిని చూస్తే తప్ప నా బాధ తీరే అవకాశం లేదు," అన్నాడు పురూరవుడు.

"నీ కున్నంత బాధ ఆ ఊర్వశికి మాత్రం ఉండదా ఏమిటి? నిన్ను వెతుక్కుంటూ ఆవిడనే రానీ!" అన్నాడు హాస్యగాడు.

ఇద్దరూ కలిసి ప్రమదవనానికి వెళ్లారు. వనమంతా వసంతశోభలు వెదజల్లుతున్నది. రాజుకు తాపం మరింత హెచ్చింది. ఆ తాపం తగ్గేటందుకు ఏదైనా ఉపాయం చెప్పమన్నాడు రాజు. విదూషకుడు కొంచెం ఆలోచించి, "నిద్ర పోతివా నీకు ఊర్వశి కలలో కనిపించి ఆనందం కలుగుతుంది. లేదా, ఊర్వశి చిత్తరువు తయారుచేసి దాన్ని చూసుకుని సంతోషించు," అన్నాడు.

"నిద్రపట్టటం అసంభవం. ఊర్వశిని చిత్రించటానికి ప్రయత్నించానంటే కళ్ళ వెంట నీరు కారి ఏమీ కనబడదు," అన్నాడు పురూరవుడు.

"అయితే మరి మూడో మార్గం లేదు," అన్నాడు విదూషకుడు.

ఇదే సమయానికి ఊర్వశి తన చెలి కత్తెతో కూడా అక్కడికి వచ్చి అదృశ్యంగా

అంతదూరాన నిలబడి, పురూరవుడు తన చెలికాడితో అనే మాటలు విని, ఆయనకు తనపై ప్రేమ ఉన్నందుకు చాలా సంతోషించింది. కాని ఆమె రాజు ఎదటపడి తన ప్రేమ వ్యక్తం చెయ్యటానికి సిగ్గుపడి, చెట్టు బెరడుపైన తన ప్రేమను రెండు పద్యాలలో రాసి రాజు ఎదట వేసింది.

దానిని విదూషకుడైన మాణవకుడు చూసి తీసి రాజుకిచ్చాడు. రాజు ఆ పద్యాలు చదివి, అవి ఊర్వశి రాసినవని తెలుసుకుని చాలా ఆనందించాడు. తరవాత ఆయన ఆ బెరడును విదూషకుడి కిచ్చి జాగ్రత్తగా ఉంచమన్నాడు.

ఇప్పుడు ఊర్వశీ, చిత్రలేఖా తమ రూపాలతో రాజు ఎదట ప్రత్యక్షమయారు. కాని పురూరవుడు ఊర్వశితో తృప్తిగా మాట్లాడే లోపలనే ఇంద్రలోకం నుంచి ఊర్వశికి పిలుపు వచ్చింది. భరతముని లక్ష్మీస్వయంవరం అని ఒక నాటకం తయారుచేసి అందులో ఊర్వశికి లక్ష్మీదేవి వేషం ఇచ్చాడు; దాన్ని ఇంద్రుడి ఎదట ప్రదర్శించాలి. ఊర్వశి పురూరవుడివద్ద సెలవు తీసుకుని ఇంద్రలోకానికి వెళ్ళిపోయింది.

ఈలోపుగా రెండు విషయాలు జరిగాయి. మాణవకుడు ఊర్వశి పద్యాలు గల



బెరడు పత్రం పారేసుకున్నాడు; రాజుగారు ప్రమదవనంలో విదూషకుడితో ఒంటరిగా మాట్లాడుతున్నారని నిపుణికద్వారా తెలుసుకుని కాశికాదేవి అక్కడికి వచ్చి, తన దాసీతోపాటు ఒక చెట్టుచాటున దాగి సంభాషణ ఆలకించ మొదలుపెట్టింది.

ఆ సమయంలో బెరడు పత్రం రాణి కాళ్లవద్దకు గాలికి కొట్టుకువచ్చింది. దాన్ని చదువుకుని రాణి మండిపోయింది. "మీరు దీనికోసమే వెతుకుతున్నట్టున్నారు. ఇదుగో ఊర్వశి ప్రణయలేఖ!" అంటూ ఆమె ముందుకు వచ్చింది. రాజు చేసేది లేక ఆమెను క్షమాపణ కోరాడు. కాని ఆమె




రాజును క్షమించకుండానే చరచరా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

అయితే తీరా అంతఃపురానికి వెళ్ళినాక ఆమెకు పశ్చాత్తాపం కలిగింది. ఆమె తన భర్తను సుముఖుణ్ణి చేసుకోవటానికి ఒక వ్రతం చేద్దామని నిశ్చయించి, ఆ రాత్రి ఈ వ్రతానికి తన మేడకు రావలిసిందిగా రాజుకు కబురు పంపింది. రాజు అప్పుడే బయలుదేరి విదూషకుడితోసహా మేడమీదికి వెళ్ళి రాణి రాకకోసం ఎదురు చూస్తూ, ఊర్వశి గురించి ముచ్చటించసాగాడు.

ఇంద్రుడి ముందు నాటకం ఆడబోయిన ఊర్వశి లక్ష్మివేషం ధరించి రంగస్థలం మీదికి వచ్చి, స్వయంవరానికి వచ్చినవారిలో తాను వరించే విష్ణువును చెప్పవలిసిన సందర్భంలో, "నేను పురూరవుణ్ణి వరిస్తాను," అనేసింది. నాటకం తయారు చేసిన భరతముని మండిపడి, "నీకు దేవలోకంలో నివాసమూ, దివ్యజ్ఞానమూ లేక పోవు గాక," అని ఊర్వశిని శపించాడు. ఊర్వశి చిన్నబోయి తల వంచుకుని నిలబడింది. ఇంద్రుడామెను చూసి జాలిపడి, "మనం పురూరవుడికి చాలా ఋణపడి ఉన్నాం. నీవు వెళ్ళి ఆయనకు ఒక కుమారుణ్ణి కని ఆయనకిచ్చేదాకా అక్కడే ఉండి, తరవాత తిరిగి రా," అన్నాడు.

ఊర్వశికి శాపంకూడా ఉపకారమే అయింది. ఆమె వెంటనే తన చెలికత్తెతో బయలుదేరి నేరుగా పురూరవుడున్న మేడ మీదికి వచ్చి ఒకపక్కగా దాగి రాజూ, విదూషకుడూ ఆడుకునే మాటలు విన్నది. కాని అంతలోనే రాణి వస్తూ ఉండటం తెలిసి వారు సంభాషణ మానేశారు.

పురూరవుడు తన భార్యతో ఎంతో అపేక్ష ఉన్నవాడిలాగా మాట్లాడాడు. "మీరు ఎవరినైనా ప్రేమించండి, వారితో సమంగా నన్ను కూడా ప్రేమిస్తే చాలు," అని రాణి కోరింది. "నాకు నీపైన తప్ప మరెవరిపైనా ప్రేమ

లేదు," అని రాజు బొంకి, చాటున ఉండి వినే ఊర్వశికి ఆశాభంగం కలిగించాడు. రాణి వెళ్ళిపోయేటప్పుడు వెళ్ళవద్దనికూడా అన్నాడు. వ్రతనిష్ఠ పాటించాలి గనక తాను ఉండటానికి వీలులేదంటూ రాణి వెళ్ళి పోయింది. రాణి వెళ్ళగానే పురూరవుడు ఊర్వశికోసం తపించసాగాడు. దానితో ఊర్వశి అనుమానాలు తొలగిపోయి ఆమె పురూరవుడి ఎదటికి వచ్చింది.

అది మొదలు ఊర్వశీ పురూరవులు ఎవరి ఆటంకమూ లేకుండా యధేచ్ఛగా కొండలూ అడవులూ తిరుగుతూ సుఖంగా కాలం గడిపారు. ఊర్వశి గర్భవతి అయింది. తనకు కొడుకు పుడతాడు, ఆ కొడుకును పురూరవుడు చూసినతరవాత తాను దేవలోకానికి తిరిగి వెళ్ళాలి. పురూరవుణ్ణి వదిలి వెళ్ళటం ఇష్టంలేక ఊర్వశి తన గర్భాన్ని రహస్యంగా ఉంచి, రాజుకు తెలియకుండా కొడుకును కని, ఆ బిడ్డణ్ణి చ్యవన మహాముని ఆశ్రమానికి తీసుకు పోయి, అక్కడ ఉండే సత్యవతి అనే తాపస స్త్రీకి వాణ్ణి పెంచమని యిచ్చి, ప్రతిష్ఠాన పురానికి తిరిగివచ్చింది. ఆ కుర్రవాడు చ్యవనాశ్రమంలో దినదిన ప్రవర్ధమానుడై పెరగసాగాడు.



కొన్ని ఏళ్లు గడిచాయి. ఒకనాడు పురూరవుడు తన భార్యలతో ప్రయాగకు స్నానం చేసి రావటానికి బయలుదేరబోతున్నాడు. ఊర్వశి అలంకరించుకుంటున్నది. ఒక దాసీది ఆమె తలలో ధరించటానికి ఒక మణిని పళ్లెంలో తెస్తూఉండగా, గద్ద ఒకటి ఆ మణిని చూసి మాంసమనుకుని భ్రమ పడి తన్నుకుపోయింది. ఈ సంగతి పురూరవుడికి తెలిసి ఆయన విల్లు తెప్పించే లోపుగా గద్ద చాలాదూరం వెళ్ళిపోయింది. రాజు తలారిని పిలిచి, ఆ గద్ద గూడు ఎక్కడో విచారించి అది వాలిన గూటినుంచి మణి తెప్పించమన్నాడు.

అయితే ఆ గద్ద ఏ గూటికీ పోలేదు. అది చ్యవనాశ్రమం పక్కగా వెళుతుండగా ఊర్వశి కొడుకు బాణం ఎక్కుపెట్టి గద్దను కొట్టాడు. ఈ సంగతి చ్యవనుడికి తెలిసింది. "వీడు ఆశ్రమ విరుద్ధమైన పనులు ప్రారంభించాడు. వీణ్ణి తల్లి దండ్రులకు అప్ప జెప్పు," అని సత్యవతితో అన్నాడు.

పురూరవుడు పంపిన తలారికి గద్ద కళేబరమూ, దాని నోట మణీ దొరికాయి. పురూరవుడు ఆ బాణంమీద రాసిఉన్న అక్షరాలు చూసి నమ్మలేకపోయాడు. ఎందుకంటే దానిపైన, "ఇది ఊర్వశీ పురూరవ పుత్రుడు ఆయువు అనేవాడిది," అని రాసి ఉన్నది.

ఇంతలో సత్యవతి కుర్రవాణ్ణి వెంటబెట్టుకుని రాజువద్దకు వచ్చింది. ఇంద్రుడికి జయంతుడున్నట్టుగా తనకూ ఒక కొడుకు ఏర్పడ్డందుకు పురూరవుడు సంతోషించాడు. ఊర్వశి విచారపడుతూండటం ఆయనకు అర్థంకాలేదు. ఊర్వశి జరిగిన సంగతి చెప్పి, "మీరు మన కొడుకును తెలుసుకున్నారు. ఇక నేను దేవలోకానికి వెళ్ళిపోవాలి," అన్నది.

"నువు వెళ్ళిపోయే పక్షంలో నేను వీడికి రాజ్యాభిషేకం చేయించి అడవికి వెళ్ళి తపస్సు చేసుకుంటాను," అన్నాడు పురూరవుడు.

దేవేంద్రుడికీ విషయం తెలిసి, నారదుడిని పురూరవుడి వద్దకు పంపాడు. అతడు పురూరవుడితో, "రాజా, ఇంద్రుడికి నీవల్ల ఇంకా చాలా సహాయం కావాలిట. అడవికి పోవద్దనీ, ఊర్వశిని పంప నవసరంలేదనీ నీతో చెప్పమన్నాడు," అన్నాడు.

ఈ మాటలకు ఊర్వశీ పురూరవు లిద్దరూ సంతోషించారు. కాని పట్టాభిషేకం మటుకు జరిగింది. రంభ మొదలు గాగల వారు అభిషేకానికి పుణ్యతీర్థాలు తెచ్చారు. పురూరవుడు రాజ్య భారాన్ని యువరాజైన తన కొడుకుకే వదిలి ఊర్వశితో సుఖంగా కాపరం చేశాడు.



# సంజీవనీ ఫలం

ఒక రాజుగారికి ఎవరో ఒక ఫలాన్ని కానుకగా ఇస్తూ, "మహారాజా, ఇది సంజీవనీ ఫలం. దీనిని తిన్నవారికి చావుండదు," అని చెప్పారు.

రాజుగారు ఆ మాట నమ్మి ఆనందంతో ఆ పండును అందుకోబోతూండగా పక్కనే ఉన్న విదూషకుడు దానిని తీసుకుని అమాంతం నోట వేసుకుని తినేశాడు.

రాజుగారికి పట్టరాని ఆగ్రహం వచ్చి, "దుర్మార్గుడా, నేనా పండు తిని చావు లేకుండా చిరంజీవిగా ఉందామనుకుంటే దాన్ని కాస్తా నువు తినేస్తావా? నీ తల తీయించేస్తాను," అన్నాడు.

"మహారాజా, అది నిజంగా సంజీవనీఫలమే అయితే నన్ను మీరెలా చంపగలరు?" అని విదూషకుడు అడిగాడు.

"అది సంజీవనీఫలమని నేను నమ్మను. నీ తల తప్పక తీయిస్తాను," అన్నాడు రాజు.

"అది మామూలు పండే అయితే ఆ భాగ్యానికి నా తల తీయించాలా, మహారాజా?" అన్నాడు విదూషకుడు.

ఈ మాట వినగానే సభలో అందరూ గొల్లున నవ్వారు. వారితోబాటు రాజుగారుకూడా నవ్వాడు.








# వరరుచి కథ

వేతసమనే పట్టణంలో దేవస్వామీ, కరంభ కుడూ అని ఇద్దరు అన్నదమ్ములుండేవారు. వారికి వ్యాడి అనీ, ఇంద్రదత్తుడనీ ఇద్దరు కుమారులుండేవారు. వ్యాడి తండ్రి మరణించాడు, అతని అన్న వైరాగ్యం చెంది ఎటో వెళ్ళిపోయాడు. వారిద్దరి భార్యలూ తమ భర్తలకోసం మనోవ్యాధి చెంది మరణించారు. ఈవిధంగా వ్యాడీ, ఇంద్రదత్తుడూ ధనికులై ఉండికూడా పసితనంలోనే దిక్కు లేనివారైపోయారు.

వాళ్ళకు మంచి గురువువద్ద చదువుకోవాలనిపించి, కుమారస్వామిని ప్రార్థించారు. ఆ స్వామి వారికి కలలో కనిపించి, "నందుడు పాలించే పాటలీపుత్రంలో వర్షుడనే బ్రాహ్మణుడున్నాడు. అతనివద్ద చదువుకోండి," అని చెప్పాడు.

అప్రకారమే వ్యాడీంద్రదత్తులు పాటలీపుత్రానికి ప్రయాణమై వెళ్ళి విచారించగా ఆ నగరంలో వర్షుడనే మూర్ఖుడొకడున్నట్టు తెలిసిందిగాని, ఉపాధ్యాయుడున్నట్టు ఎవరూ చెప్పలేదు. వారు ఆ మూర్ఖుడి ఇంటికే వెళ్ళారు. వర్షుడి ఇల్లు దరిద్రదేవతకు పుట్టిల్లులాగే ఉంది, వర్షుడి భార్య సాక్షాత్తూ దరిద్రదేవతలాగే కనబడింది.

ఆ కుర్రవాళ్ళు ఆవిడ కాళ్ళపైన పడి నమస్కారం చేసి తాము వచ్చిన పని చెప్పారు. ఆమె వారితో, "నా భర్త ఒకప్పుడు మూర్ఖుడేగాని, ఆయన కుమారస్వామిని మెప్పించి సకల విద్యలూ నేర్చుకున్నాడు. ఎవరైనా ఏకసంతగ్రాహి వస్తేనేగాని ఆయన పాఠం చెప్పడు," అని చెప్పింది.

వారు వర్షుడి భార్యకు నూరు వరహాలిచ్చి ఏకసంతగ్రాహికోసం వెతుకుతూ ఒక నాడు కౌశాంబీ నగరానికి చేరుకున్నారు.

కౌశాంబీ నగరంలో సోమదత్తుడనే బ్రాహ్మణుడుండేవాడు. ఆయన భార్య వసు

బి. నాగేశ్వరరావు



దత్త. ఆ ఇద్దరికీ వరరుచి అని ఒక కుమారు డుండేవాడు. వరరుచి చిన్నవాడై ఉండగానే సోమదత్తుడు చనిపోయాడు. పాపం ఆయన భార్య ఎలాగో కష్టపడి వరరుచిని పెంచు తున్నది. దైవికంగా వ్యాడీంద్రదత్తులు ఆ ఇంటికే అతిథులుగా వచ్చారు.

ఆ సమయంలో వాద్యాల చప్పుడు విని పించింది. "మీ నాన్నగారి స్నేహితుడు నందుడు నాట్యం చేస్తున్నాడు," అని వసు దత్త వరరుచితో అంటూ, భర్తను తలుచు కుని కంట తడిపెట్టింది.

వెంటనే వరరుచి తల్లితో, "నన్ను అక్క డికి వెళ్ళనియ్యమ్మా! నేను అదంతా చూసి వచ్చి ఆ పాటలూ, నాట్యమూ నీకు చూపి స్తాను!" అన్నాడు. ఇది విని వ్యాడీంద్ర దత్తులు నిర్ఘాంతపోయారు. వసుదత్త వారితో, "నిజమే, నాయనా! వీడు ఒక్కసారి వింటే ఏదైనా పట్టుకోగలడు!" అన్నది.

వ్యాడీంద్రదత్తులు ఈ మాట నమ్మలేక పరీక్షకోసం ఏదో చదివారు. వరరుచి వారు చదివినదంతా ఒక్కసారి విని తిరిగి చెప్పే శాడు. తరవాత వరరుచి వారిని వెంటబెట్టు కుని నాట్యం జరిగేచోటికి వెళ్ళి తిరిగివచ్చి, తాను చూసినదంతా పాడుతూ, ఆడుతూ తల్లికి చూపాడు.

వ్యాడీంద్రదత్తులు వసుదత్తకు తమ వృత్తాంతమంతా చెప్పి, "అమ్మా, నీ కొడు కును మా వెంట పంపినట్టయితే మేము వర్షోపాధ్యాయులవద్ద అన్ని విద్యలూ నేర్చు కునే అవకాశం దొరుకుతుంది. మమ్మల్ని అనుగ్రహించు!" అని వేడారు.

"అలాగే, నాయనా! వీణ్ణి వెంటపెట్టుకు పోయి మీ తమ్ముడులాగే చూసుకోండి!" అన్నది వసుదత్త.

వారు ముగ్గురూ తిరిగి పాటలీపుత్రానికి వచ్చి వర్షుణ్ణి చూసి విద్య నేర్పమన్నారు. ఆయన వరరుచిని చూస్తూనే ఉపాధ్యా యుడు కావటానికి సమ్మతించాడు. గురువు

నోట ఒక్కసారి విన్న వేదాన్ని వరరుచి వెంటనే ఒప్పగించేవాడు, వారిద్దరూ చెప్పగా విని వ్యాడీ, ఆ ముగ్గురూ చెప్పగా విని ఇంద్ర దత్తుడూ ఒప్పగించగలిగేవారు.

పరమ మూర్ఖుడుగా తలచబడుతున్న వర్షోపాధ్యాయుణ్ణీ, అతని తెలివైన శిష్యులనూ చూసి నగరవాసులు దిగ్భ్రమ చెందారు. ఆయన ఖ్యాతి నగరమంతటా పాకింది. ఆయన తమ్ముడైన ఉపవర్షుడు తప్ప మిగిలిన ప్రజలందరూ ఆయనను దేవుడల్లే చూడసాగారు. ఆఖరుకు ఆ నగరాన్ని ఏలే నంద మహారాజు కూడా ఆయన ఇంటిని బంగారు కానుకలతో నింపేశాడు.

తన ముగ్గురు శిష్యుల ధర్మమా అంటూ వర్షోపాధ్యాయుల అపఖ్యాతీ, దారిద్ర్యమూ కూడా తొలగిపోయాయి. శిష్యుల విద్యాభ్యాసం ముగిసింది. కాని వారింకా గురువును విడిచి వెళ్లలేదు. ఈ సమయంలో నగరంలో ఇంద్రోత్సవం జరిగింది. వేడుక చూడటానికి మిత్రులు ముగ్గురూ వెళ్ళారు. అక్కడ వారికి రతీదేవిలాటి చక్కని యువ్వని ఒకతె కనిపించింది. ఆమెవెంట కూడా స్నేహితురాళ్ళున్నారు.

ఒకరినొకరు చూసుకుంటూనే వరరుచీ ఆ పిల్లాకూడా ప్రేమించుకున్నారు. ఆ పిల్ల ఎవరని వరరుచి అడగగా, "మన గురువు



గారి తమ్ముడు ఉపవర్షుడున్నాడే, ఆయన కూతురు, ఉపకోశ!" అని ఇంద్రదత్తుడు చెప్పాడు. ఇదేవిధంగా ఉపకోశ తన స్నేహితురాళ్ల ద్వారా వరరుచిని గురించి తెలుసుకున్నది. ఆ రాత్రి వరరుచి సరిగా నిద్రపోలేదు. తెల్లవారి నిద్ర లేస్తూనే వెళ్ళి ఉపవర్షుడి ఇంటికెదురుగా ఉండే ఒక మామిడిచెట్టుకింద కూర్చున్నాడు.

అతని వద్దకు ఉపకోశ స్నేహితురాలు వచ్చి, అతనిని ఉపకోశ ఎంతగా ప్రేమిస్తున్నదో వర్ణించి చెప్పింది. వరరుచి ఆమెతో, "నేను అపకీర్తికి పాల్పడలేను. నా కోరికా, మీ స్నేహితురాలి కోరికా తీరాలంటే ఒకటే మార్గం: ఆమె తల్లిదండ్రుల సమ్మతితో మేమిద్దరమూ పెళ్ళాడాలి. లేకపోతే మా ఇద్దరి ప్రాణాలూ పోతాయి. మా ప్రాణాలను ఎలాగైనా కాపాడు," అన్నాడు.

వెంటనే ఆమె వెళ్ళి ఉన్న సంగతి ఉపకోశ తల్లికి చెప్పింది, ఆవిడ తన భర్తతో చెప్పింది. ఉపవర్షుడు తన అన్నగారైన వర్షుడితో సంప్రతించాడు. వరరుచికీ, ఉపకోశకూ పెళ్లి నిశ్చయమయింది. వ్యాడి కౌశాంబికి వెళ్లి వరరుచి తల్లి అయిన వసుదత్తను తీసుకువచ్చాడు. వరరుచి ఉపకోశను కన్యాదానం పుచ్చుకుని భార్యతోనూ, తల్లితోనూ పాటలీపుత్రంలో కాపరం పెట్టాడు.






రానురాను వర్షుడి శిష్యకోటి పెరిగి పోతున్నది. ఆ శిష్యులలో పాణిని అని ఒక మొద్దబ్బాయి ఉండేవాడు. వాడికి చదువు రాదని తోచి వర్షుడి భార్య వాణ్ణి పంపేసింది. పాణిని నేరుగా హిమాలయానికి వెళ్లి తీవ్ర మైన తపస్సు చేసి శంకరుణ్ణి మెప్పించి, ఆ దేవుడివల్ల ఒక కొత్త వ్యాకరణం పొంది తిరిగివచ్చి, అందరికన్న తెలివిగలవాడైన వరరుచిని వాదానికి పిలిచాడు. ఎనిమిది రోజులు వాదం జరిగినమీదట వరరుచి పాణినికి ఓడిపోయాడు. అంతటితో, అప్పటి వరకూ అమలులో ఉండిన ఐంద్ర వ్యాకరణం లోకంలో నశించిపోయింది.

తరవాత వరరుచికూడా హిమాలయానికి వెళ్ళి శంకరుణ్ణి గురించి తపస్సు చేసి కొత్త వ్యాకరణం సంపాదించుకుని వచ్చి దానిని వర్షోపాధ్యాయుడికికూడా వినిపించాడు.

వ్యాడీ, ఇంద్రదత్తుడు తమ గురువును విడిచి వెళ్ళిపోగోరి గురుదక్షిణ ఏమి కావాలని అడిగారు. వర్షుడు కోటి వరహాలు కోరాడు. వాళ్ళిద్దరూ వరరుచి దగ్గిరికి వచ్చి, "గురువుగారు కోటి వరహాలు కోరారు. అంత సొమ్ము ఇవ్వగలవాడు నందమహారాజు ఒక్కడే. ఆయన అయోధ్యలోని నంద కటకంలో ఉన్నాడు. ఆయనను పోయి యాచింతాము, నీవుకూడా రా!" అన్నారు.

వీరు ముగ్గురూ కలిసి నందకటకం వెళ్లేసరికి నందమహారాజు అంతకు ముందే చనిపోయినట్టు తెలిసింది. ప్రజలంతా గగ్గోలు పడుతున్నారు. ముగ్గురూ హతాశులై పోయారు. కాని ఇంద్రదత్తుడు ఒక ఆలోచన చేశాడు. అతనికి యోగవిద్య తెలుసును. అందుచేత తన మిత్రులతో, "చూడండి, నేను వెళ్ళి ఈ రాజు కళేబరంలో ప్రవేశి స్తాను. వ్యాడి నా దేహాన్ని కాపాడుతూ ఇక్కడే ఉంటాడు. వరరుచీ, నీవు వచ్చి నన్ను ధనం అడుగు, నేను ఇచ్చేస్తాను. మన పని తీరిపోతుంది!" అన్నాడు.

మిగిలిన ఇద్దరూ సరేనన్న మీదట ఇంద్రదత్తుడు ఒక పాడుబడిన దేవాలయంలో తన శరీరాన్ని విడిచి, చచ్చిపోయిన నందరాజు శరీరంలో ప్రవేశించాడు. వ్యాడి ఇంద్రదత్తుడి శరీరాన్ని కాపాడుతూ ఆ ఆలయంలోనే ఉండిపోయాడు.

చచ్చిపోయిన రాజు మళ్ళీ బతికేసరికి ప్రజల ఆనందానికి మేరలేదు. వాళ్లు ఉత్సవాలు చేసుకున్నారు. వరరుచి ఆ సమయంలో రాజాస్థానానికి వెళ్ళి రాజును ఆశీర్వదించి కోటి వరహాలు కోరాడు. నందుడు తన మంత్రి అయిన శకటాలుణ్ణి పిలిచి, "ఈ బ్రాహ్మణ యువకుడికి కోటి వరహాలు ఇచ్చెయ్యి!" అని ఆజ్ఞాపించాడు.

శకటాలుడు అసాధ్యుడు. చచ్చిపోయిన రాజు బతకటమే విడ్డూరంగా ఉంటే, అంతలోనే ఎవరో వచ్చి కోటి వరహాలు అడగటమూ, రాజు అంతమొత్తాన్నీ ఇచ్చెయ్యమని అజ్ఞాపించటమూ చూసి శకటాలుడు నిజం ఊహించాడు. ఎవడో యోగసిద్ధుడు రాజు కళేబరంలో ప్రవేశించి ఉంటాడు. యోగసిద్ధుడి కళేబరం సమీపానే ఎక్కడో ఉంటుంది. ఇలా ఊహించినవాడై శకటాలుడు తన పరిచారకులతో, "దేశంలో ఎక్కడ ఏ శవం దొరికినా కాల్చి పారె



య్యండి!" అని చెప్పాడు. వాళ్ళు పాడుపడిన దేవాలయంలో ఇంద్రదత్తుడి శరీరాన్ని చూసి, అడ్డంవచ్చిన వ్యాడిని దూరంగా నెట్టి, ఆ శరీరాన్ని కాస్తా కాల్చేశారు.

అక్కడ మాయనందుడు శకటాలుణ్ణి, "ఆ యువకుడికి డబ్బు ఇచ్చావా, లేదా?" అని తొందర చెయ్యసాగాడు.

"మహారాజా, ప్రజలు ఉత్సవంలో నిమగ్నులై ఉండటంచేత అంతా గందరగోళంగా ఉన్నది. కొంచెం ఆగితే అలాగే ఇప్పిస్తాను!" అన్నాడు శకటాలుడు.

ఇంతలో వ్యాడి పరిగెత్తుకుంటూ వచ్చి, "మహారాజా, తమ ధర్మ పరిపాలనలో

తమ భటులు దారుణమైన పని చేశారు; యోగసమాధిలో ఉన్న ఒక బ్రాహ్మణ యువకుణ్ణి శవమని వంకపెట్టి బలాత్కారంగా తీసుకుపోయి దహనం చేశారు!" అన్నాడు. నందరాజు శరీరంలో ఉన్న ఇంద్రదత్తుడికి నిజం తెలిసిపోయింది; రాజభటులు కాల్చినది తన దేహాన్నే!

తరవాత అతను వ్యాడితో ఏకాంతంగా మాట్లాడాడు, జరిగినదానికి ఎంతో చింతించాడు. వ్యాడి అతనితో, "జరిగినదానికి చేసేదేమీ లేదు. ఈ శకటాలుణ్ణి ఒక కంట కనిపెట్టి ఉండు, వీడు ఉద్దండుడు. నిన్ను నాశనం చేసి పూర్వనందుడి కొడుకైన చంద్రగుప్తుడికి పట్టం కట్టగలడు. అందుచేత వరరుచిని ప్రధాన మంత్రిగా పెట్టుకో!" అన్నాడు. మాయానందుడు ఆ ప్రకారమే వరరుచిని తన ప్రధాన మంత్రిగా చేశాడు. కాని రాజులో క్రమంగా మార్పు వచ్చింది. తాను రాజు కళేబరంలో ప్రవేశించినందుకు మొదట దుఃఖించిన ఇంద్రదత్తుడు రాజభోగాలు మరిగి, క్రమంగా నీచబుద్ధి అయిపోయాడు. వరరుచికి అతనిపై ఉండిన మైత్రి క్రమంగా క్షీణించింది. చివరకు రాజుకు అతనిపై అనుమానాలుకూడా పుట్టుకువచ్చాయి. రాజు తనను చంపించటానికి చూస్తున్నాడని తెలిసి వరరుచి శకటాలుడి ఇంట తలదాచుకున్నాడు.

వరరుచిని రాజు చంపించాడన్న పుకారు నగరమంతా పాకింది. ఈ పుకారు వినగానే ఉపకోశ అగ్నిప్రవేశం చేసింది, వసుదత్త గుండె పగిలి చనిపోయింది. తరవాత కొద్ది కాలానికే చాణక్యుడనే బ్రాహ్మణుడు నందరాజుపై అలిగి శపథం చేసి ఏడు రోజులలో అయన చచ్చేటట్టు చేశాడు. చంద్రగుప్తుడు రాజ్యానికి వచ్చాడు.

వరరుచి జీవితంపై విరక్తి కలిగి అడవికి పోయి తపస్సు చేసుకుని అక్కడే దేహం చాలించాడు.






## 9

మార్కోపోలో 13 వ శతాబ్దం ఆఖరు దశాబ్దంలో ఇండియాకు వచ్చి ఇక్కడ కొంత కాలం ఉండి, అనేక విషయాలు చూసి వాటిని తన గ్రంథంలో రాశాడు. ఈ వివరాలతో ఈ యాత్రల కథ ముగింతాము.

అతను మన దేశం గురించి రాసిన వివరాలు ఇవి:

"సింహళంనుంచి 60 మైళ్ళు సముద్ర ప్రయాణం చేస్తే మాబారు (చోళ) దేశం వస్తుంది. ఈ దేశాన్ని అయిదుగురు స్వతంత్ర రాజులు పరిపాలిస్తున్నారు. మాబారు దేశానికీ సింహళానికీ మధ్య ఉండే సింధుశాఖలో ముత్యాలు దొరుకుతాయి. ప్రపంచంలో ఉండే ముత్యాలలో హెచ్చుభాగం ఇక్కడే దొరుకుతాయి. ఇక్కడ సముద్రం అటే లోతు ఉండదు. కొందరు వర్తకులు కలిసి ఒక పడవ చేసుకుని ఇక్కడికి వస్తారు. ఇలాటి పడవలు చాలా వస్తాయి. ఏప్రిల్ లోనూ, మే మొదటి సగంలోనూ ముత్యాల వేట సాగుతుంది. వర్తకులు ముత్యపు చిప్పలు సముద్రంలోనుంచి తీసుకువచ్చే వాళ్ళను జీతాలిచ్చి తెచ్చుకుంటారు. వీళ్ళు నీటిలో దిగి, అడుగుకు వెళ్ళి ముత్యపు చిప్పలు తెచ్చి వర్తకుల కిస్తారు. ముత్యపు చిప్పలలో చిన్నవీ, పెద్దవీ, రకరకాలైనవీ ముత్యాలుంటాయి. ముత్యపు చిప్పలను పగలదీసి మంచినీటిలో వేస్తే మాంసం పైకి

# మార్కోపోలో సాహస యాత్రలు




తేలి ముత్యాలు అడుగుకు పోతాయి. ఈవిధంగా వర్తకులు అసంఖ్యాకమైన ముత్యాలను సంపాదిస్తారు....సముద్రంలో దిగినవారు ఉపద్రవమైన చేపల వాత పడకుండా బ్రాహ్మణులు మంత్రాలు చదివి, వర్తకులు పట్టిన ముత్యాలలో నూరింట అయిదువంతులు పుచ్చుకుంటారు....

"మాబారులో దర్జీలు లేరు. ఎందుకంటే ఇది వేడిదేశం కావటంచేత ఇక్కడివారు దుస్తులు ధరించరు, అంగవస్త్రాలు మాత్రమే ధరిస్తారు. రాజుగారుకూడా అంగవస్త్రమే ధరిస్తాడు. అయితే దాని అంచుల వెంబడి రత్నాలు కుట్టి ఉంటాయి, అందు



చేత దాని విలువ అపారం....రాజుగారు ధరించే అభరణాలకు అంతు లేదు. వాటికి ఎవరూ విలువ కట్టలేరు. వాటితో ఒక మహా నగరం కొనెయ్యవచ్చు. విలువగల ముత్యాలుగాని రత్నాలుగాని తన రాజ్యం దాటి పోకుండా ఈయన శాసనం చేశాడు.

"ఈ దేశంలో గుర్రాల పెంపకం లేదు. అందుచేత హెచ్చుగా ధనం వెచ్చించి అరబ్బీ దేశాల నుంచి గుర్రాలను దిగుమతి చేసుకుంటారు...ఈ దేశంలో భర్త చనిపోయినప్పుడు భార్య అతడి చితిపైన పడి తాను కూడా కాలిపోతుంది. ఇలా చేసేవారు ఉత్తమ స్త్రీలుగా భావించబడతారు... ఇక్కడి ప్రజలు భోజనం చేసేటప్పుడు కుడి చేతిని మాత్రమే ఉపయోగిస్తారు...ఏదైనా తాగేటప్పుడు చెంబు నోటికి తగలనివ్వరు.

"అప్పులవాళ్లు తమ సొమ్ము వసూలు చేసుకోలేకపోయినప్పుడు బాకీ ఉన్నవాడి చుట్టూ ఒక గిరి గీసినట్టయితే ఆ మనిషి సొమ్ము చెల్లించేదాకా ఆ గిరి దాటరాదు. అలా దాటినవాళ్లు మరణదండనకు గురి అవుతారు. రాజుగారికే ఇది తటస్థించటం మార్కో కళ్లారా చూశాడు. రాజుగారు ఒక విదేశీ వర్తకుడికి బాకీపడి అన్న సమయానికి బాకీ చెల్లించలేదుట. ఆ బాకీదారు ఒకనాడు





రాజుగారు గుర్రంమీద వస్తూండగా గుర్రం చుట్టూ గిరి గీశాడు. రాజుగారు డబ్బు తెప్పించి ఆ విదేశీ వర్తకుడికి ఇచ్చినదాకా గుర్రంతోసహా గిరి మధ్యనే ఉండిపోయాడు.

"ఇక్కడివాళ్లు శకునాలు మహా పాటిస్తారు. ముఖ్యంగా ప్రయాణం వెళ్లేవారు అనేక రకాల శకునాలు చూస్తారు. బయలుదేరేవాడు, ఎవరైనా తుమ్మితే వెంటనే కూర్చుంటాడు. రెండో తుమ్ము వినిపిస్తేగాని లేవడు. రాహుకాలం ఏ పనికీ పనికిరాదు. ఈ రాహుకాలం ఒక్కొక్క రోజు ఒక్కొక్క వేళకు వస్తుంది... ఇక్కడి ఇళ్లనిండా బల్లులుంటాయి. బల్లి పలుకు ఫలితాలను కూడా వీరు పాటిస్తారు."

మార్కోపోలో 1290 లో మోటుపల్లి రేవులో దిగాడు. ఆ సమయంలో రుద్రమదేవి ఆంధ్రదేశాన్ని పరిపాలిస్తూ ఉండేది. ఆమెను గురించి మార్కోపోలో ఈ విధంగా రాశాడు:

"ఈ దేశాన్ని ఏలే రాణి గొప్ప జ్ఞాని. ఈమె భర్త మరణించి పూర్తిగా 40 సంవత్సరాలయింది. ఈమె తిరిగి వివాహం చేసుకోలేదు. ఈ 40 సంవత్సరాలూ ఈమె తన భర్తలాగే రాజ్యాన్ని ఎంతో ధర్మంగానూ, న్యాయంగానూ పరిపాలించింది. ప్రజలకు



ఆమెపై గల అనురాగాలు సాధారణంగా ఏ రాజుకూ, రాణికీ ఎవరూ చూపిఉండరు.

"ఈ రాజ్యంలో వజ్రాలు దొరుకుతాయి. వానలు కురిసి కొండలపైనుండి వాగులు ప్రవహించినప్పుడు వజ్రాలు రాళ్లనుండి విడివడి కొట్టుకువస్తాయి... ప్రపంచంలో వజ్రాలు దొరికేది ఈ రాజ్యంలో మాత్రమే. మేలిరకం వజ్రాలు ఇక్కడినుండి పెద్ద ఖానుకూ, ఇతర మహారాజులకూ పోతాయి. ఎందుకంటే వీటిని సామాన్యులు కొనలేరు... ప్రపంచంలోకెల్లా మేలిరకం దుప్పటిగుడ్డ (బక్రమ్) ఇక్కడ ఉత్పత్తి అవుతుంది. దీనిని ధరించటానికి మహారాజులూ, మహా



రాణులూ సయితం ఉబలాటపడతారన్న మాట. ఇక్కడ పశు సంపద జాస్తి. ఇక్కడ ఉండేటంత పెద్ద గొర్రెలు ప్రపంచంలో ఎక్కడా లేవు... "

"ఈ దేశంలో లాడ్ రాజ్యం అని ఉన్నదీ. వైశ్యులందరూ ఇక్కడే పుడతారు. ప్రపంచంలో వీరిని మించిన వర్తకులుగాని, నమ్మకస్తులుగాని లేరు. విదేశాలనుండి వర్తకులు వచ్చినప్పుడు వీరు వాళ్ళ సరుకు స్వాధీనం చేసుకుని, వారికి ఈ దేశపు ఆచార వ్యవహారాలు తెలియకపోయినప్పటికీ, వారి సరుకులను న్యాయమైన ధరలకు అమ్మి, వారి కోసం ఇతర సరుకులు న్యాయమైన ధరలకు కొనిపెడతారు. ప్రతిఫలంకూడా కోరరు, కృతజ్ఞతాపూర్వకంగా ఏమైనా ఇస్తే పుచ్చుకుంటారు. వీరు మాంసం తినరు, సారా తాగరు. ఎంతో నీతిగా జీవిస్తారు. జీవహింస చేయరు, దాన్ని మహాపాపంగా పరిగణిస్తారు. వీరు చోళదేశంనుంచి మేలి ముత్యాలు తెచ్చి తమ రాజుకు అమ్ముతారు. రాజుకు వారు తాము ఇచ్చిన ధర చెబుతారు. రాజు వారికి రెట్టింపు ధర ఇస్తాడు....

"ఇండియా దేశంలో ప్రజలందరూ తాంబూలం సేవిస్తారు. కులీనులలో ఈ అలవాటు మరీ జాస్తి. తాంబూలంలో వారు సున్నంతోబాటు కర్పూరం మొదలైన అనేక సుగంధ ద్రవ్యాలు వేసుకుంటారు....

"ఇండియాలో అఖరు రాజ్యం నెచ్-మక్రాన్. ఇక్కడ మహమ్మదీయులు జాస్తి. ఇక్కడ వరితోబాటు గోధుమకూడా జాస్తిగా పండుతుంది...

"మాబారుకూ దీనికీ మధ్య ఉండే దేశం తూర్పు ఖండంలోకెల్లా ఉత్తమోత్తమమైనది. ఇక్కడ ఉండే నగరాలన్నిటినీ గురించి చెప్పటం సాధ్యమయే పనికాదు..."

—( అయిపోయింది )





# ప్రియురాలి హత్య

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీవు ఏ ధర్మాన్ని పాటించి ఇంత దీక్షగా ఈ అపరాత్రివేళ ఈ శవాన్ని మోసుకుపోతున్నావో నాకు తెలి యదు గాని, ధర్మాన్ని అనుసరించేవారు కూడా పశ్చాత్తాప పడతారుసుమా. ఇందుకు తార్కాణంగా నీకు సనత్కుమారుడి కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

పూర్వం బ్రహ్మపుత్రానదీ తీరపు అరణ్యా ప్రాంతంలో ఒక రాజువద్ద సనత్కుమారు డనే యువకుడు కొలువు ఉండేవాడు. అత నికి వేట అంటే చాలా ప్రీతి. అందుచేత అతను తరుచు అడివికి వెళ్ళి పెద్దపులు లనూ, ఇతర వన్యమృగాలనూ వేటాడుతూ ఉండేవాడు.

## బేతాళ కథలు



సనత్కుమారుడు వేటాడబోయే అడవి ప్రాంతాన్ని అనుకుని ఒక సామంతుడి గ్రామాలున్నాయి. ఆ సామంతుడి పేరు వసువర్మ. వసువర్మా, సనత్కుమారుడూ స్నేహితులు. ఒక్కొక్కసారి ఇద్దరూ జతగా వేటకు వెళుతూ ఉండేవారు. అయితే వసువర్మకు రాచకార్యాలు జాస్తిగా ఉండటంచేత అతను ఎప్పుడోగాని వేటకు వచ్చేవాడు కాడు.

ఒకనాడు సనత్కుమారుడు వేటకు బయలుదేరి భిల్లుజాతివాళ్ళుండే గూడెం మీదుగా వెళ్లసాగాడు. భిల్లుజాతివాళ్లు వసువర్మ పొలిమేరన ఉన్న అడవి కొంత కొట్టి బీళ్ళూ, పొలాలూ ఏర్పాటుచేసుకుని చాలా కాలంగా నివసిస్తున్నారు.

అడవికి వెళ్ళే సనత్కుమారుడికి ఒక బీడులో గొర్రెలను మేపుకుంటూ ఒక భిల్లకన్య కనిపించింది. నాగరికత లేకపోయినా ఆ పిల్లకు గల సహజ సౌందర్యం చూసి సనత్కుమారుడు ఆశ్చర్యం చెందాడు.

అతడు ఆమె సమీపంలో గుర్రం దిగి, "అమ్మాయీ, నీపేరేమిటి? మీ ఇల్లెక్కడ?" అని ప్రశ్నించాడు. ఆ పిల్ల మొదట్లో అతనితో మనసిచ్చి మాట్లాడలేదు. ఎందుకంటే అతను ఎవరో రాజోద్యోగి. అటువంటి ఉద్యోగులు తమ భిల్లజాతివాళ్లను మనుషులల్లే చూడరు; తమకు అన్నిరకాల ఇబ్బందులూ వాళ్ళమూలంగానే కలుగుతాయి.

అయితే సనత్కుమారుడు మామూలు ఉద్యోగులవంటివాడు కాడు. ఎంతో మంచివాడు లాగానూ, దయామయుడు లాగానూ కనపడ్డాడు. అందుచేత ఆమె మెత్తబడి, "నా పేరు నాగిని. అదుగో ఆ కనిపించేదే మా గూడెం!" అని చెప్పింది.

ఆమె సనత్కుమారుడితో ఇంకా ఎన్నో విషయాలు చెప్పింది. తమ ఇంటి కష్టసుఖాలు చెప్పింది. అంతేగాక తమ గూడెం వాళ్ళు పడే కష్టాలు కూడా చెప్పింది.

"ఇంత చిన్నదానివి నీకు మీ గూడెం వ్యవహారాలన్నీ ఎందుకు?" అని అడిగాడు సనత్కుమారుడు. నాగిని జవాబు చెప్పలేదు.

అది మొదలు సనత్కుమారుడు అవకాశం దొరికినప్పుడల్లా భిల్లుల గూడెంకేసి వచ్చేవాడు. అతనికి వేటమీద మోజు ఏమీ లేకుండాపోయింది. నాగినితో కబుర్లు చెప్పటమూ, ఆమె అందం చూసి ఆనందించటమూ అతనికి అలవాటైపోయింది.

ఒకనాడు నాగిని అతనితో, "మా రాజుగారు మా పొలాలన్నీ ఆక్రమించుకొంటారుట, నిజమేనా? మమ్మల్ని అడివిలోకి తరిమేస్తారుటగా?" అన్నది.

"కావచ్చు. కాని చిన్నదానివి, ఆడదానివి నీకెందుకీ గొడవలు? పెద్దవాళ్లూ, మగవాళ్ళూ చూసుకుంటారులే," అన్నాడు సనత్కుమారుడు.

"మా తాత ముత్తాతలనాటినుంచీ మేం ఇక్కడే ఉంటున్నాం. ఇప్పుడు రాజుగారు మా బీళ్లు కాజేసి వారి ఆవులను మేపుకుని, మమ్మల్ని అడవిలోకి వెళ్లి పులులతోపాటు బతకమంటే అది నాకుమాత్రం ఎందుకు పట్టదూ?" అన్నది నాగిని ఉద్రేకంతో.

సనత్కుమారుడు ఆమెకేసి ఆశ్చర్యంతో చూశాడు. నాగిని మామూలు కాపుపిల్లల




వంటిది కాదు. అతనికి ఆమెమీద గల ఇష్టం ఆ క్షణంనుంచీ ప్రేమగా మారింది. అతను నాగిని చెయ్యి పట్టుకుని, "నాగినీ, నేను నిన్ను ప్రేమిస్తున్నాను!" అన్నాడు.

నాగిని తన చెయ్యి విడిపించుకుని చరచరా అక్కడినుంచి వెళ్ళిపోయింది. తాను అన్న మాట నాగినికి కోపం తెప్పించిందని సనత్కుమారుడు గ్రహించాడు. తరవాత మూడు నాలుగు రోజులు ఆమెను చూడబోవటానికి అతనికి ధైర్యం చాలలేదు.

ఇంతలో రాజకార్యంపైన సనత్కుమారుడు దేశాంతరం వెళ్ళిపోవలసివచ్చింది. అక్కడ అతను మూడు మాసాలున్న మీదట



లేదు. అతను మళ్ళీ నాగినిని చూసే అవ కాశం కలిగిందిగదా అని మాత్రమే సంతో షించాడు.

భిల్లుల గూడెంలో వసువర్మకు అనుకూ లంగా ఉండేవాళ్లు ఇద్దరున్నారు. వారు గ్రామానికి సంబధించిన అధికారులు. భిల్ల జాతివాళ్లు వారిద్దరినీ ఒక పాకలో బంధించి పాకకు నిప్పు పెట్టారు. వారిని రక్షించటానికి గాను సనత్కుమారుడు భిల్లుల గూడెం వెళ్ళాడు. అదృష్టవశాత్తూ పాకలో ఖైదు చేయబడినవాళ్లు ప్రాణాలతో బయటపడ్డారు. ఆ తరవాత సనత్కుమారుడికి గూడెంలో ఏమీ చేసేది లేకపోయింది. ఎందుకంటే భిల్లులందరూ గూడెం వదిలేసి, ఆడవాళ్ళ తోనూ, పిల్లలతోనూ సహా తమ పొలాలలోకీ, అడవి అంచుకూ వెళ్లిపోయారు.

అతనికి పిలుపు వచ్చింది. అతను తిరిగి వచ్చి తనపైన ఒక కొత్త పని పడిందని తెలుసుకున్నాడు.

అదేమిటంటే, వసువర్మపైన భిల్లజాతి వారు తిరగబడ్డారు; తాము నివసించే ప్రాంతాన్ని వసువర్మ స్వాధీనం చేసుకో కుండా యుద్ధం చెయ్యటానికి వారు నిశ్చ యించుకున్నారు. వసువర్మకు సహాయంగా కొందరు సైనికులు పంపబడుతున్నారు. వారికి నాయకుడుగా ఉండటానికి సనత్కు మారుణ్ణి నియోగించారు.

ఈ పని తనకు అగ్నిపరీక్ష అవుతుందని సనత్కుమారుడు కలలో కూడా అనుకో

సనత్కుమారుడు సైనికులతో సహా భిల్లులు చేరి ఉన్నచోటికి వెళ్ళాడు. కొలు పులూ, జాతరలూ చేసేవాళ్ళలాగా వాళ్ళు కాకిగోల చేస్తున్నారు, తప్పెటలు వాయిస్తు న్నారు. అందరి చేతులలోనూ ఏవో ఆయు ధాలున్నాయి. ఆఖరుకు చిన్నపిల్లలుకూడా ఏవో కర్రలు పట్టుకున్నారు.

సైనికులను చూడగానే భిల్లులు సద్దు మణిగారు. సనత్కుమారుడు వారితో,






"నిష్కారణంగా విద్రోహులు కాకండి. ఇద్దరు మనుషులను కాల్చి చంపటానికి ప్రయత్నించారు. ఇప్పటికైనా ఈ అల్లరి చాలించి వెళ్ళిపొండి!" అన్నాడు.

"అదంతా వల్లకాదు. వాళ్ళిద్దరే అసలు ద్రోహులు; మంచి పొలాలు లంచం పుచ్చుకుని మాకు అన్యాయం చెయ్యటానికి ప్రయత్నించారు. ఈ గడ్డ మాది. దీనిని వదిలి పోయేకన్న ఇక్కడే ప్రాణాలు విడుస్తాం!" అని భిల్లులు సమాధానం చెప్పారు.

సనత్కుమారుడు నాగినికోసం కళ్ళతో వెతికాడు. కాని ఆ పిల్ల జాడ కనపడలేదు. అతను తన సైనికులకు ఉత్తరువిచ్చాడు. వాళ్ళు భిల్లులపై బాణాలు వదిలారు. కొద్ది మంది భిల్లులు దెబ్బ తిని పడిపోయేసరికి మిగిలినవారు చెల్లాచెదురుగా పారిపోసాగారు.

ఇంతలో ఒక స్త్రీ ఆకారం ఒక ఎత్తయిన దిబ్బమీదికి ఎక్కి, "ఆగండి! మీరు మగ వాళ్ళు కారా? మీ గడ్డను కాపాడుకోవటం ఇదేనా? రెండు బాణాలు మీద పడగానే పిరికిపందలల్లే పారిపోతున్నారా?" అని గట్టిగా అరిచింది.

పారిపోతున్నవాళ్లు ఆగి మళ్ళీ వెనక్కు రాసాగారు. సనత్కుమారుడు ఆ స్త్రీని గుర్తించాడు. ఆమె నాగిని. అతనికి మతి పోయినట్టయింది. ఈ యుద్ధంలో ఒక పక్షానికి తాను నాయకుడైతే రెండో పక్షానికి నాగిని నాయకురాలయింది.

ఇప్పుడు భిల్లులంతా నాగిని వెనక చేరి సైనికులపై రాళ్ళూ, ఈటెలూ విసరసాగారు. తన సైనికులతో, "తలపడండి!" అనవలసిన బాధ్యత సనత్కుమారుడిపైన ఉన్నది. అతను తన సైనికులకు ఉత్తరువిచ్చాడు. కొద్దిసేపట్లోనే నాగిని గుండెలో బాణం గుచ్చుకుని ఆమె ఒరిగిపోవటం సనత్కుమారుడు చూశాడు. అతనికి మతి పోయినట్టయింది. అతను గబగబా వెళ్లి ఆమె తల తన ఒడిలో పెట్టుకుని ఏకధారగా



విడవసాగాడు. నాగిని కళ్లు తెరిచి అతని ముఖంకేసే చూస్తూ ప్రాణాలు వదిలింది.

తాను ప్రజాకంటకుల తరఫున తాను ప్రేమించిన స్త్రీ పాలిటికి హంతకుడుగా పని చేసిన సంగతి సనత్కుమారుడికి అర్థమయింది. అతను వైరాగ్యం చెందిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం. సనత్కుమారుడు నాగినిని ఎందుకు చంపాడు? అతనికి ఆమెపై నిజంగా ప్రేమ లేకనా, లేక ఆమె పక్షాన న్యాయం ఉన్నదని తెలియకనా? ఒకవేళ అతను నాగినిని ప్రేమించకపోయినప్పటికీ తాను అధర్మం పక్షాన పోట్లాడుతున్న సంగతి తెలిసినా అతను ఆమె పాలిటికి హంతకుడు కాకుండా ఉండేవాడుకదా! ఆ సంగతి నాగిని చనిపోయేదాకా ఎందుకు అతను తెలుసుకోలేదు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వ్యక్తులు అనుసరించే ధర్మాన్ని సంఘం నిర్ణయిస్తుంది. సనత్కుమారుడు ప్రజాకంటకుల పక్షం వాడు. అందుచేత అతను వారి ధర్మమే అవలంబించాడు. కాకపోతే అతనికి నాగినిపై నిజంగా ప్రేమ ఉండటంచేత ఆ ధర్మానికీ అతని ప్రేమకూ సంఘర్షణ వచ్చింది. ఈ సంఘర్షణలో ఎప్పుడూ సంఘ పరమైన విశ్వాసానిదే పైచెయ్యిగా ఉంటుంది. అందుచేత సనత్కుమారుడు తన ప్రేమను జయించి నాగిని హత్యకు కారకుడైనాడు. అయితే తాను అవలంబించిన ధర్మానికి తన ప్రేమను బలిచేసిన మరుక్షణం అతనికి జ్ఞానోదయమయింది. నిజమైన ధర్మం నాగిని పక్షానే ఉన్నదని అతను గుర్తించగలిగాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# "సోమరి నాగు"

(గత సంచిక తరువాయి)

సోమరినాగును మించిన గజదొంగ లేడన్న ఖ్యాతి దశదిశలా వ్యాపించింది. సూచౌ సైనిక శిబిరానికి నాయకుడైన చాంగ్ అతన్ని పిలిపించి, "నీవు దొంగలకు మేటివట గదా?" అని అడిగాడు.

"అయ్యా, నేను దొంగనే కాను, దొంగలకు మేటి నెలా అవుతాను. నన్ను ఎవరూ ఎన్నడూ దొంగతనం చేస్తూండగా పట్టుకోలేదు, విచారణ చెయ్యలేదు, శిక్షించనూ లేదు. కాకపోతే నాకు కొన్ని విద్యలు తెలుసు. వాటిని ప్రదర్శించి స్నేహితులను రంజింపజేస్తూ ఉంటాను. అయినప్పటికీ తమరికి నాతో ఏదైనా పనిపడితే చెప్పండి, తమకోసం అగ్గిలోకి ఉరకమన్నా, నీటిలోకి ఉరకమన్నా సిద్ధమే," అన్నాడు సోమరి నాగు. ఈ మాటలకు నాయకుడు చాంగ్ సంతోషించాడు. దొంగనుగా వాణ్ణి పట్టటానికి అగచాట్లు పడేకన్న వాడివల్ల సహాయం పొందటమే ఆయనకు యుక్తంగా తోచింది. ఆయన సోమరినాగుతో, "నీవు చాలా చోట్ల దొంగతనాలు చేశావని నాకు తెలుసు. నేను నిన్ను శిక్షించబోను, కాని నీ సామర్థ్యం చూడాలని ఉన్నది. ఈ రాత్రికి ఈ చిలకను దొంగిలించి, రేపు ఉదయం తెచ్చి నాకియ్యి, నీ ప్రయోజకత్వం చూస్తాం!" అన్నాడు.

సోమరినాగు అంగీకార సూచకంగా తల వంచి సెలవు పుచ్చుకున్నాడు.

నాయకుడు చాంగ్ ఆరాత్రి చిలక పంజరానికి ఇద్దరు మనుషులను కాపలా పెట్టి, "తెల్లవార్లూ దీనిని కాపాడండి. పొరపాటు జరిగిందంటే మీ చర్మాలు వొలిపిస్తాను, జాగ్రత్త!" అన్నాడు.

కాపలావాళ్ళిద్దరూ తెల్లవార్లూ కళ్ళలో వత్తులు వేసుకుని చిలకకు కాపలాకాశారు.

చీనా జానపద కథ



తెల్లవారేముందుగా సోమరినాగు చాంగ్ గది కప్పులో కంత చేసుకుని లోపలికి దిగాడు. ఆ గదిలో అతనికి చాంగ్ ధరించే దుప్పటమూ, టోపీ, ఆయన ఉపయోగించే చేతి లాంతరూ కనిపించాయి. వెంటనే వాడికొక ఆలోచన తట్టింది. వాడు టోపీ పెట్టుకుని, దుప్పటం కప్పుకుని, లాంతరు వెలిగించి, అచ్చు చాంగ్‌లాగే ముసలినడక నడుస్తూ, లాంతరు వెలుగు తన మొహాన పడకుండా పట్టుకుని కాపలావాళ్ల దగ్గిరికి వెళ్ళి, చాంగ్ కంఠాన్నీ, మాట ధోరణినీ అనుకరిస్తూ, "తెల్లవారుతోంది. కాపలా చాలు, పదండి!" అన్నాడు. ఇలా అంటూనే వాడు చెయ్యి చాచి చిలకను అందుకుని అవతలి గదిలోకి వెళ్ళిపోయాడు.

అప్పటికే కాపలావాళ్ళు పూర్తిగా నిద్ర మత్తుతో ఉన్నారు. ఆ వచ్చిన మనిషి చాంగ్ కాదని వారికి ఏమాత్రమూ అనుమానం కలగలేదు. వెళ్ళిపొమ్మన్నదే తడవుగా వాళ్లిద్దరూ వెళ్ళి నిద్రపోయారు.

తెల్లవారుతూనే చాంగ్ ఇవతలకు వచ్చి చిలక పోయిన సంగతి తెలుసుకుని, కాపలావాళ్లను కేకేశాడు. కాని వాళ్ళు పలకలేదు. నౌకర్లు వెళ్ళి వాళ్ళను నిద్రలేపుకువచ్చారు.

"చిలక ఏది? మీరు కాపలా మాని ఎందుకు పడుకున్నారు?" అని చాంగ్ వాళ్ళను అడిగాడు.

"తమరు వచ్చి చిలకను లోపలికి తీసుకుపోతూ మమ్మల్ని వెళ్ళమన్నారు గదండీ!" అన్నారు వాళ్ళు.

"నేను బయటికి రావటమేమిటి? మీకేమైనా దయ్యం కనిపించిందా ఏమిటి?" అన్నాడు చాంగ్.

"మే మిద్దరమూ ఎలా పొరబడతామండీ?" అన్నారు వాళ్ళు.

చాంగ్ ఇల్లంతా వెతికి తన గది పైభాగంలో కంత చూసి ఇది సోమరినాగు పనే అనుకున్నాడు. కాస్సేపటికల్లా సోమరినాగే

స్వయంగా వచ్చి చిలకను ఆయనకిచ్చి, తాను చేసిన యుక్తి చెప్పాడు. చాంగ్ సంతోషించి వాడికి అభయం ఇచ్చాడు. సోమరినాగు అందుకు ప్రతిఫలంగా చాంగ్‌కు అనేక బహుమానాలిచ్చాడు.

* * *

ఒక జూదగాడు ఒకనాడు జూదంలో వెయ్యి కాసులు గెలిచి ఇంటికి వెళుతుండగా దారిలో సోమరినాగు కనిపించాడు. అతను సోమరినాగుతో, "ఇవాళ రాత్రి ఈ సొమ్ము నా దిండుకింద పెట్టుకుని నిద్రపోబోతున్నాను. దీన్ని నీవు కాజెయ్యగలిగితే నేను నీకు విందు చేస్తాను; కాజెయ్యలేకపోతే నీవు నాకు విందు చెయ్యాలి. సమ్మతమేనా?" అన్నాడు.

సోమరినాగు సమ్మతమే నన్నాడు.

జూదగాడు ఇంటికి వెళ్ళి తాను డబ్బు గెలుచుకున్న సంగతి భార్యతో చెప్పాడు. ఆమె సంతోషించి కోడిని కోసి వండింది. ఆ రాత్రి ఇద్దరూ తృప్తిగా భోజనం చేసేసినాక భార్య తినగా మిగిలిన కోడిని వంటింటో ఉంచేసింది.

తరవాత వాళ్ళు పడుకోబోయేటప్పుడు భర్త భార్యతో తానూ సోమరినాగూ వేసుకున్న పందెం గురించి చెప్పాడు. వాళ్లు



మేలుకుని ఉండాలని ఒకరినొకరు హెచ్చరించుకున్నారు. వారి సంభాషణను బయటినుంచి సోమరినాగు వింటూనేఉన్నాడు.

భార్యా భర్తలు మేలుకుని ఉండేటట్టుంటే తనకు దొంగతనం సాధ్యపడదు. అందుచేత వాడొక ఉపాయం ఆలోచించాడు. వాడు చల్లగా వంటఇంట్లో ప్రవేశించి ఒక ఎండిపోయిన జనప పుల్లను కొరకసాగాడు.

భార్య ఈ చప్పుడు విని చివాలున లేచి కూచుని, "అయ్యయ్యో, దిక్కుమాలిన పిల్లి మిగిలిపోయిన కోడిని పొట్టన పెట్టుకుంటున్నది," అంటూ మంచంమీదినుంచి దూకి వంటింట్లోకి పరిగెత్తింది.

ఈలోపల సోమరినాగు వంటింట్లోనుంచి దొడ్డిలోకి వెళ్లి పెద్ద బండ ఎత్తి బావిలో వేశాడు. దభేలుమని చప్పుడయింది.

"ఓసి పిచ్చిముండా! సహం కోడికోసం బావిలో పడిందా?" అనుకుంటూ జూదగాడు దొడ్లోకి వెళ్లాడు.

ఈ సందులో సోమరినాగు పడక గదిలో జొరబడి దిండు కిందినుంచి సొమ్ము లాగేసి దాటిపోయాడు.

చీకటిలో తడుపుకుంటూ భార్య తన కోడి క్షేమంగానే ఉన్నదని తెలుసుకున్నది, తన భార్య బావిలో పడలేదని జూదరికూడా తెలుసుకున్నాడు. కాని ఇద్దరూ తిరిగి మంచం దగ్గిరికి వచ్చి చూసేసరికి దిండు కదిలించి ఉన్నది; దానికింద డబ్బుసంచీ కాస్తా పోయింది!

"ఇద్దరమూ మేలుకుని ఉండగానే డబ్బు పోయిందే, ఇంతకంటె నామర్దా ఉంటుందా?" అనుకున్నారు వాళ్లు.

తెల్లవారుతూనే సోమరినాగు డబ్బు తెచ్చి ఇచ్చి తనకు విందు చెయ్యమని జూదరిని అడిగాడు. జూదరి సోమరినాగును ఒక భోజనశాలకు తీసుకుపోయి భోజనమూ, పానీయాలూ తెప్పించాడు. ఇద్దరూ భోజనం చేస్తూ కిందటి రాత్రి జరిగిన సంగతులు చెప్పుకుని విరగబడి నవ్వుతున్నారు.



భోజనశాలవాడు వాళ్లతో, "ఏమిటి మీరు చెప్పుకునే హాస్యం?" అని అడిగాడు. వాళ్లు జరిగినదంతా భోజనశాలవాడితో చెప్పారు.

భోజనశాలవాడు సోమరినాగుతో, "నిన్ను గురించి చాలా కథలు విన్నాను, కాని వాటిని ఇదివరకు నమ్మలేదు. ఇదుగో ఈ బల్లమీద ఉన్న సారాపాత్ర చూడు. దీన్ని ఈ రాత్రి నువు కాజేశావంటే రేపు నేను నీకు విందు చేస్తాను," అన్నాడు.

సోమరినాగు నవ్వి, "సరే!" అన్నాడు.

"నా తలుపులూ, కిటికీలూ పగలగొట్టగూడదుసుమా. ఈ పాత్రనుమాత్రమే కాజెయ్యాలి. నీ తెలివి చూస్తాం!" అన్నాడు భోజనశాలవాడు. "సరే, సరే!" అంటూ సోమరినాగు వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి భోజనశాలవాడు తలుపులు గట్టిగా మూయించి, సోమరినాగు రావటానికి మరొక మార్గం ఏమీ లేదని రూఢిచేసుకుని, దీపం తెచ్చి బల్లమీదనే పెట్టి అర్ధరాత్రిదాకా పానపాత్రకు కాపలా కాశాడు. కాని ఏమీ జరగలేదు. అతడికి నిద్ర ముంచుకు వచ్చింది. తల బల్లపై ఆనించి పెద్దగా గుర్రుపెట్టి నిద్రపోయాడు.

బయటినుంచి వింటున్న సోమరినాగు ఈ గురక వినపడగానే చప్పుడు చెయ్యకుండా ఇంటికప్పు మీదికెక్కి, నాలుగు





పెంకులు తొలగించి, కప్పులో కంత చేశాడు. వాడివద్ద ఒక సన్నని, పొడుగాటి వెదురు గొట్టం, దాని చివర ఒక తోలుతిత్తి కట్టి ఉన్నది. వెదురు గొట్టం ఈ చివరనుంచి ఆ చివరకు డొల్ల చేసిఉన్నది.

కప్పులోని కంతలోనుంచి వాడు గొట్టాన్ని దింపి, తోలుతిత్తి పానపాత్రలో పడేలాగ చేసి, గొట్టం రెండో చివర మూతి పెట్టి ఊదాడు. వాడు ఊదిన గాలికి తిత్తి ఉబ్బింది. పానపాత్ర మూతి సన్నటిది. అందుచేత ఉబ్బిన తిత్తి పాత్రమూతికి అడ్డుపడింది. తిత్తి ఉబ్బగానే సోమరినాగు వెదురుగొట్టం పైచివర గట్టిగా మూసేసి



గొట్టాన్ని పైకి లాగాడు. తిత్తితోబాటు పాన పాత్రకూడా పైకి వచ్చేసింది. వాడు దాన్ని తీసుకుని, పెంకులు ఎప్పటిలాగే కప్పేసి ఇంటికి వెళ్ళిపోయాడు.

భోజనశాల యజమాని నిద్రలేచి చూసే సరికి బల్లమీద దీపం వెలుగుతున్నది గాని పానపాత్ర మాయమయింది. తలుపులూ, కిటికీలూ మూసినవి మూసినట్టే ఉన్నాయి.



ఒక గ్రామంలో ఒక న్యాయాధిపతి ఉండేవాడు. ఆయన అక్రమంగా సంపాదించిన ధనం చాలా మూలుగుతున్నది; అందులో కొంత వదిలించరాదా అని కొందరు మిత్రులు సోమరినాగును హెచ్చరించారు. వాడు ఒకరాత్రి ఆ గ్రామం వెళ్ళి, న్యాయాధిపతి ధనాగారం ప్రవేశించి, ఒక చిన్న పీపాలో ఉన్న రెండువందల పలాల బంగారాన్ని సంగ్రహించి, ఆ దొంగతనం తనదేనని స్పష్టంగా తెలియగలందులకు గోడమీద ఒక పువ్వు బొమ్మ గీసి వెళ్ళిపోయాడు.

రెండుమూడు రోజుల అనంతరం న్యాయాధిపతి తన బంగారుపీపా పోయిన సంగతి కనుక్కొని పువ్వుబొమ్మకూడా చూశాడు. రక్షకాధికారులను అడిగితే, "ఆ గుర్తు సోమరినాగుది," అన్నారు.



"అయితే వాణ్ణి తక్షణం పట్టుకురండి," అన్నాడు న్యాయాధిపతి.

"అయ్యా, వాడి సంగతి మీరెరగరు. వాణ్ణి పట్టుకోవటం ప్రమాదకరం. మాట్లాడక ఊరుకోవటం క్షేమం," అన్నారు రక్షకాధికార్లు.

న్యాయాధిపతి మండిపడి, "మీరు దొంగలతో లాలూచీ అవుతున్నారా? మిమ్మల్ని కొరత వేయిస్తాను!" అని వారిని భయపెట్టాడు.

చేసేది లేక ఆ అధికారులు సూచౌనగరానికి వెళ్లి పడమటి ద్వారందగ్గిర సోమరి నాగును కలుసుకుని జరిగిన సంగతి అంతా చెప్పారు.

"ఆ బంగారం నా దగ్గిర లేదు. దాన్ని నేను మీ దొడ్లలోనే పాతిపెట్టాను. ఈ రాత్రికి మీరు ఇళ్లకు వెళ్లి పడుకోండి. రేపు పొద్దున న్యాయాధిపతిగారు నన్ను పట్టుకునే ప్రయత్నం మానేట్టు నేను చూస్తానుగద!" అన్నాడు సోమరినాగు.

ఆ రాత్రి వాడు మళ్ళీ న్యాయాధిపతి ఇంటికి వెళ్లాడు. ఆయనకు ఇద్దరు భార్యలు. వారిలో ఒక భార్య ఒంటరిగా పడుకున్నది. సోమరినాగు ఆమె జుట్టు కత్తిరించి, దానిని న్యాయాధికారి సీలుపెట్టెలో పెట్టి, తన




గుర్తుగా మళ్లీ గోడమీద పువ్వుబొమ్మ గీసి వెళ్లిపోయాడు.

న్యాయాధిపతి భార్య నిద్రలేచి తన జుట్టు మెడదాకా మాత్రమే వేళ్లాడుతూ ఉండటం చూసి కెవ్వున అరిచింది. అందరూ వచ్చారు. దురంతం జరిగినట్టు న్యాయాధికారికి తెలిసింది. "ఏమిటి ఈ ఘోరాలు! దొంగ ఇంత వరకు దొరకనేలేదు. మరెవడో వచ్చి నా భార్య జుట్టు కత్తిరించుకుపోయాడు. నా సీలుపెట్టె పట్టుకురండి," అన్నాడాయన.

సీలుపెట్టెకు వేసిన బీగం వేసినట్టే ఉన్నది. ఆయన పెట్టె తెరిచి అందులో ఉండే తన అధికారముద్ర పోనందుకు



సంతోషించాడు. కాని దాని అడుగున వెంట్రుకలు చూసి ఆయనకు పట్టరాని ఆశ్చర్యం కలిగింది. అప్పుడే గోడమీది పువ్వుబొమ్మ సంగతి కూడా ఆయనకు తెలియవచ్చింది.

న్యాయాధికారి, "మళ్లీ వీడేనా?" అంటూ కొయ్యబారిపొయ్యాడు. ఎందుకంటే తన భార్య జుట్టు కత్తిరించినవాడు తలుచుకుంటే తన గొంతుకోసి ఉండును; ఆ జుట్టును తెచ్చి తన సీలుపెట్టెలో పెట్టిన వాడు కావాలంటే తన అధికార ముద్రను కాజేసిఉండును. అలాటివాడితో పేచీ పెట్టుకోవటం అపాయకరం!

ఆయన సూచొకు వెళ్ళిన రక్షకాధికార్లను పిలిపించి, "మీరు సోమరినాగును పట్టుకోనవసరంలేదు," అని చెప్పేశాడు. వాళ్లు అప్పటికే తమ దొడ్లలో సోమరినాగు దాచిన బంగారం తీసేసుకున్నారు. అందుచేత ఆ కిందటిరోజు వాణ్ణి పట్టుకోకపోవటం అన్నివిధాలా మంచిదయిందనుకున్నారు.

* * *

మరొక నగరంలో ఒక అవినీతిపరుడైన న్యాయాధిపతి ఉండేవాడు. అతడు చాలా అక్రమాలు చేసి ఉండటంవల్ల వాటిని గురించి విచారించటానికి ఒక పరిశీలనాధికారిని పంపారు.

ఆ న్యాయాధిపతి సోమరినాగుకు కట్నాలు పంపి కబురు చేసి పిలిపించాడు.

"నావల్ల తమకు ఎలాటి ఉపకారం కావాలి?" అని సోమరినాగు ఆయనను అడిగాడు.

"నన్ను విచారణ చెయ్యటానికి ఒక అధికారి వచ్చిఉన్నాడు. ఆయన దగ్గిర ఉండే అధికారముద్ర దొంగిలిస్తే అతడి ఉద్యోగం కాస్తా ఊడుతుంది," అన్నాడు న్యాయాధిపతి.

"చిత్తం, దాన్ని నేను తెచ్చి రేపు తమకిస్తాను," అన్నాడు సోమరినాగు. మరుసటి

ఉదయమే వాడు పరిశీలనాధికారి అధికార ముద్ర తెచ్చి న్యాయాధిపతికిచ్చాడు.

న్యాయాధిపతి వాడికి నూరు పలాల వెండి ఇచ్చి, "ఇది నీ బహుమానం. ఇక వెళ్లు!" అన్నాడు.

సోమరినాగు వెళ్లిపోక, "అయ్యా, మీరు ఈ ముద్రతో ఏమి చెయ్యాలనుకుంటున్నారు?" అని అడిగాడు.

"ఈ ముద్ర నాదగ్గిర ఉన్నంతకాలమూ ఆ అధికారి నన్నేమీ చెయ్యలేడు," అన్నాడు న్యాయాధిపతి.

"నన్ను మన్నించినా సలహా ఒకటి వినండి. ఆ అధికారి చాలా తెలివిగలవాడు. ఆయనను మంచి చేసుకోవాలంటే ఈ ముద్రను ఆయనవద్దకు పంపి, ఇది మీ భటులకు ఒక దొంగవద్ద దొరికిందనీ, దొంగ మాత్రం తప్పించుకుపోయాడనీ చెప్పండి," అన్నాడు సోమరినాగు.

"ఇంకా నయం! ఇది ఆయనకు తిరిగి ఇచ్చేశాక ఆయన నేను చెప్పినట్టు వింటాడా? నీకెందుకు గొడవంతా దేనికి? నీ దారిన వెళ్ళు!" అన్నాడు న్యాయాధిపతి.

సోమరినాగు ఇంకేమీ అనకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

పరిశీలనాధికారి తన అధికార ముద్ర పోయిన సంగతి తెలుసుకుని, న్యాయాధిపతే



ఈ పని చేయించి ఉంటాడని గ్రహించి, తనకు సుస్తీగా ఉన్నట్టు నటించి కచేరీ నడపటం మానేశాడు.

"ఈ సుస్తీ ఏమిటో నాకు తెలుసులే!" అనుకుని న్యాయాధిపతి తనలో తాను నవ్వుకున్నాడు. కాని రోజులు గడిచిపోతున్నాయి. పెద్ద అధికారికి సుస్తీ చేసిందంటే తాను వెళ్లి చూడకపోవటం తప్పవుతుంది. అందు చేత ఆయన అధికారిని చూడబోయాడు.

అధికారి న్యాయాధిపతిని చాలాసేపు కూచోబెట్టి, చాలా టీ తాగించి, చాలా సరదాగా కబుర్లు చెప్పాడు. ఇంతలో నౌకర్లు పరిగెత్తుకుంటూ వచ్చి, "బాబూ, వంటఇల్లు అంటుకున్నది," అని చెప్పారు.

వెంటనే పరిశీలనాధికారి తన సీలు పెట్టెను న్యాయాధిపతికిస్తూ, "దీన్ని ప్రస్తుతం మీ ఇంటో ఉంచండి. నిప్పు ఆర్పటానికి మనుషులను పంపండి," అన్నాడు. న్యాయాధిపతి ఖాళీ సీలుపెట్టెను తన ఇంటికి పట్టుకుపోయాడు. మనుషులు వచ్చి అధికారి వంటఇంట్లో అంటుకున్న నిప్పు ఆర్పేశారు. తన సీలుపెట్టెను తెచ్చి తన కివ్వవలిసిందనీ, తాను మర్నాటినుంచీ కచేరీకి వస్తున్నాననీ అధికారి న్యాయాధిపతికి కబురుచేశాడు.

న్యాయాధిపతి ఖాళీ సీలుపెట్టెను తీసుకుపోయి ఇచ్చినట్టయితే ముద్రను కాజేసిన నేరం తనపైనే పడుతుంది. అందుచేత ఆయన ఆ పెట్టెలో ముద్రను మళ్లీ పెట్టేసి పరిశీలనాధికారికి ఇచ్చేశాడు.

కొద్దిరోజులు విచారణ జరిపి పరిశీలనాధికారి రాజధానికి తిరిగివెళ్లి న్యాయాధిపతి అక్రమాలన్నీ రుజువైనట్టు నివేదిక రాస్తూ, అందులో తన అధికారముద్ర పోయి దొరికిన వైనంకూడా రాశాడు.

న్యాయాధిపతికి కఠినమైన శిక్ష పడింది. సోమరినాగు సలహా పాటించనందుకు ఆయన అనుభవించాడు.



# గలివర్ యాత్రలు



రాజుగారి గ్రంధాలయంలో నేను పుస్తకాలు చదవడానికి ప్రత్యేకమైన ఏర్పాట్లు చేశారు. ఒక్కో పంక్తి చదవడానికి నిచ్చెన బారంతా నడచేవాణ్ణి.



ఓరోజు మంగలినడిగి రాజుగారి శిరోజాలు తీసుకుని వాటితో చక్కటి దువ్వెన తయారుచేసుకున్నాను. ఒకొక్క వెంట్రుక మన దువ్వెన్న పళ్ళంత బలంగానూ వుంది.



రాణీగారి తలవెంట్రుక ఒకటి సంపాదించి దాంతో ఓ కుర్చీ పేము అల్లినట్టు అల్లాను. కాని, ఆవిడమీద గౌరవంకొద్దీ ఆ కుర్చీమీద నేను ఎన్నడూ కూర్చోలేదు.



మా దేశంలో పియానో వాయించే అనుభవంతో, సాహసించి రాజుగారి పియానోకూడా సాధన చేశాను. రెండు బడితెలకు చివర ఎలకతోలు చుట్టి ఆ చివరినుంచి ఈ చివరకు కొంపలు మునిగినట్టు పరిగెడుతూ ఓమాదిరి సంగీతం వినిపించేవాణ్ణి. కొంచెం హైరానగానే వుండేది.



ఒకనాడు రాజుగారు సపరివారంగా సముద్రతీరానికి విలాస విహారం బయలుదేరారు. నా ప్రయాణాల గదిలో నన్నెక్కించి దాదికూడా బయలుదేరింది. త్వరలోనే మేము సముద్రతీరం చేరుకున్నాము.



అక్కడ నా పెట్టెని ఓ కుర్రాడికి పప్పగించి దాది రాణిగారి వద్దకు వెళ్ళింది.





చాలాసేపు గడిచింది. దాదికోసం చూసి చూసి ఆ కుర్రాడు పెట్టెని కింద పెట్టి ఎటు వెళ్ళాడో ఏమో—

—హఠాత్తుగా పెద్ద తుఫాను గాలి వీచినట్టు హోరు బయలుదేరింది. ఉన్నట్టుండి నా గది ఒక్క కుదుపుతో పైకి లేచి ఆకాశంలో ఎగిరిపోసాగింది.



ఉన్నట్టుండి నా గది దభేలుమని సముద్రంలో పడింది. కట్టుదిట్టంగా కట్టినందువల్ల నీరు మాత్రం లోనికి రాలేదు.



రోజు బావుంటే ఏ ఓడవాళ్లో చూడకపోడదా అన్న ఆశతో చొక్కా చింపి ఓ కొయ్యకి జండాలా కట్టాను.



పై కప్పు చిల్లులోంచి ఆ జెండాని పైకెత్తి పట్టుకు కూచున్నాను. ఇంతలో నా పెట్టెని ఎవరో లాగుతున్న చప్పుడయింది.



మా దేశపు ఓడవాళ్ళే నా జండా చూసి నన్ను ఓడలోకి లాగారు. ఏదో నేరానికి శిక్షగా నేనా పెట్టెలో వున్నానని వాళ్ళనుకున్నారట.



కాదని నా యాత్రా విశేషాలు చెప్పినా నమ్మలేదు. చివరికి చిన్న బండిచక్రమంతున్న రాణీగారి ఉంగరం, దువ్వెన మొదలైనవి చూపించాక నమ్మారు. కొండంత మనుషుల్ని చూసి చూసివున్న నా కళ్లు నాలాటి మనుషుల్నే చూసేనరికి—



—వాళ్ళంతా నలకల్లాగా కనబడసాగారు. నేను చాలా ఎత్తైనట్టు వాళ్ళు లిల్లిపుట్లంత వాళ్ళయినట్లు చూడసాగాను.



అలాగే మాట్లాడినపుడు కూడా అలవాటుకొద్దీ గావు కేకలు పెడుతూ ఉండేవాణ్ణి. చాలారోజులదాకా సాటి మనుషులు అలవాటుపడలేదు.



మొత్తాని కెలాగయితేనేం భగవంతుడి కృపవల్ల సురక్షితంగా ఇల్లు చేరి నా భార్యా పిల్లలను చూసుకో గలిగాను. ఇంకపైన మిమ్మల్ని విడిచి వెళ్లనమ్మా అని మా పాపాయికి మాట ఇచ్చాను.



# ముసలాడి భార్య

పూర్వం టర్కీ దేశంలో ఒక సంపన్నుడుండేవాడు. ఆయనకు ఒక్కడే కొడుకు. ఆ కుర్రవాడికి పెళ్ళి చేసే వయసు వచ్చింది. ఎన్నో సంబంధాలు చూశారుగాని వాడి తల్లిదండ్రులకు ఒక్కరూ నచ్చలేదు.

ఈ సంపన్నుల ఇంటికి కొద్ది దూరంలో ఒక పేదవాడి ఇల్లుండేది. ఈ పేదవాడు రోజూ కొండమీదికి వెళ్లి కట్టెలు కొట్టి తెచ్చి, వాటిని అమ్మగా వచ్చిన డబ్బులతో ఎలాగో సంసారం జరిపేవాడు. ఈ పేదవాడికి ఒక పెళ్ళియీడు కూతురున్నది.

ఒకనాడు ఎందుకో సంపన్నుడి భార్య పేదవాడి ఇంటికేసి వచ్చి, పేదవాడి కూతురును చూసి, ఆ పిల్ల అందచందాలు చూసి ముగ్ధురాలయింది. ఆమె వెంటనే పేదవాడి భార్యతో, "మా అబ్బాయికి ఎన్నో సంబంధాలు చూశాం. ఒక్కటీ నచ్చలేదు. మీ పిల్ల బొమ్మలాగున్నది. మీరు సరేనంటే మా అబ్బాయికి కళ్ళకద్దుకుని చేసుకుంటాం!" అన్నది. పేదవాడి భార్య తన చెవులను తానే నమ్మలేక, "అంతా దేవుడి అనుగ్రహం!" అన్నది. సంపన్నుడి భార్య అప్పటికప్పుడే తన చేతినుంచి ఉంగరం ఒకటి తీసి పేదవాడి కూతురి వేలికి పెట్టి పెళ్ళికి ప్రధానం కూడా చేసేసి ఇంటికి వెళ్లిపోయింది. ఆమె తన కుమారుడితో, "నాయనా, నీకు అద్భుతమైన అందగత్తెను చూసి వచ్చాను. త్వరలోనే పెళ్లి ఏర్పాటు చేద్దాం," అన్నది.

కట్టెలు కొట్టేవాడు సాయంకాలం ఇంటికి వచ్చాడు. తమ కుమార్తెకు సంపన్నులతో పెళ్ళి నిశ్చయమయిందనీ, ప్రధానంకూడా అయిపోయిందనీ భార్య చెప్పింది. పేదవాడు నిర్ఘాంతపోయాడు.

అయితే ఈ పెళ్ళి జరగలేదు. ఎందుచేతనంటే అమ్మలక్కలందరూ సంపన్నుడి భార్యతో, "ఇదేం పెళ్లి? ఆ కూటికి గతిలేని

ఎల్. రామచంద్రయ్య



57



పిల్ల నీకు కోడలైై మీ పరువు దక్కనిస్తుందా? పిల్ల అందంగా ఉంటే సరా, మంచి సంప్రదాయమూ, సంస్కారమూ చూసుకోవద్దా!" అని, ఊదరపెట్టేశారు.

ఈ మాటలతో సంపన్నుడి భార్య మనసు వికలమైపోయింది. తాను పెద్ద పొరపాటే చేశానని ఆమె గ్రహించింది. ఆమె ఎవరితోనూ చెప్పకుండా పేదవాడి ఇంటికి వెళ్ళి, వాడి కూతురి చేతిన ఉన్న తన ఉంగరాన్ని లాగేసుకుని, నేరుగా ఇంటికి వచ్చేసింది. ప్రధానం కాస్తా రద్దు అయిపోయింది.

ఆ సాయంకాలం కట్టెలు కొట్టుకునే వాడు ఇంటికి వచ్చేసరికి, అతడి భార్యా, కుమార్తే పుట్టెడు దుఃఖంలో మునిగి, అవమానంతో కుమిలిపోతున్నారు. పేదవాడు తన కూతుర్ని ఓదార్చి, "తల్లీ, నీవేమీ బెంగపడకు. రేపు ఉదయం నా వెంట మసీదుకు రా. మసీదు నుంచి మొట్టమొదటగా ఎవడు బయటికి వస్తే వాడికి నిన్నిచ్చి పెళ్లి చేసేస్తాను. అల్లా తోడు!" అన్నాడు.

తెల్లవారుతూనే పేదవాడు తన కుమార్తెను పెళ్లికూతురులాగా అలంకరించి, మేలిముసుగు వేసి, చెయ్యి పట్టుకుని మసీదువద్దకు తీసుకుపోయాడు. వారిద్దరూ మసీదు వాకిట వేచి ఉన్నారు. కొంతసేపటికి లోపలినుంచి చింకి పాతలు ధరించిన ముసలాడు ఒకడు బయటికి వచ్చాడు.

పేదవాడు ఆ ముసలాడికి అల్లా పేర అభివాదనం చేసి, తాను చేసిన ప్రమాణం గురించి చెప్పి, తన కుమార్తెను తీసుకుపోయి ఏలుకోమని కోరాడు.

"నాయనా, నాకు ఇల్లూ వాకిలీ లేదు. గట్టిగా రోజుకు పది రాగిడబ్బులు సంపాదించలేను. నీ కూతురిని పెళ్ళాడి ఎలా పోషించగలను?" అన్నాడు ముసలాడు.

"బాబూ, నాకు వ్రతభంగం చెయ్యకు. మేమైనా ధనికులం కాము. ఒకపూట డొక్కలో కాళ్ళు పెట్టుకు పడుకోవటం

చాతనయినవాళ్ళమే," అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

"సరే నీయిష్టం," అంటూ ముసలాడు పేదవాడి కూమార్తెను మసీదు పక్కనే ఉన్న చీకటి కొట్టులాటి గుడిసెలోకి తీసుకు పోయి ఇద్దరు సాక్షుల ఎదట ఆమెను పెళ్లాడాడు. సాక్షులు ఆశీర్వచనాలు చెప్పినాక ఆ పిల్లను ఆ గుడిసెలో ఒంటరిగా దిగవిడిచి అందరూ వెళ్ళిపోయారు. అది మొదలు ముసలాడు ప్రతి సాయంకాలమూ గుడిసెకు వచ్చి తన భార్యకు ఒక కొవ్వొత్తీ, అయిదు రాగిడబ్బులూ ఇచ్చి మళ్ళీ వెళ్ళిపోతూ ఉండేవాడు. ఆ డబ్బులతో ఆమె తనకు కావలిసిన రొట్టె అదీ కొనుక్కొని తిని, ఒంటరి జీవితం గడపసాగింది.

పేదవాడి భార్య మాత్రం రోజూ తన కూతురి దుస్థితి తలుచుకుని కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ ఉండేది. ఆమెను భర్త ఒకసారి తమ కూతురివద్దకు తెచ్చాడు. ఆ పిల్ల పోషణ లేక చూడటానికి భయంకరంగా ఉన్నది. వంటిమీది దుస్తులు పేలికలైపోయాయి. తల్లి ఆమెకు జుట్టు దువ్వి, కట్టుకోవటానికి వేరే దుస్తులిచ్చింది.

ఇలా ఉండగా సంపన్నుల కొడుక్కు మరొక సంబంధం చూసి ముహూర్తం




ఏర్పాటు చేశారు. సంపన్నుడి భార్య పేదవాడి భార్యను పెళ్లినాడు సాయం పిలిచింది. ఆమె వెళ్లి తన కూతురికి ఈ సంగతి చెప్పి, "నాకు తోడుగా నువ్వుకూడా వస్తావా ఏమిటి?" అని అడిగింది.

"మా ఆయనను అడిగి ఆయన ఒప్పుకుంటే అలాగే వస్తాను," అన్నది కూతురు.

ఆ సాయంకాలం ముసలివాడు వచ్చినప్పుడామె, "మా అమ్మను సంపన్నుల ఇంట పెళ్లికి సాయం పిలిచారుట. నేను కూడా తోడు వెళ్ళనా?" అని అడిగింది.

"తప్పక వెళ్ళు. అంతే కాదు, నిన్ను చూడగానే పెళ్లికొడుకు పెళ్ళికూతురిని వది



లేసి నిన్నే చేసుకుంటానంటాడు. అందుకు ఒప్పుకో!" అన్నాడు ముసలాడు.

"ఛీ ఛీ, అలా అయితే నేను వెళ్ళనే వెళ్ళను!" అన్నది ఆ పిల్ల.

"ఏమిటి నీ అభ్యంతరం? ఇక్కడ నీ కేముంది? అక్కడ నీకు అన్నిసుఖాలూ అమరుతాయి!" అన్నాడు ముసలాడు.

"లేదు, నాకు రాసిపెట్టి ఉన్నది ఈ బ్రతుకే. నే నొకవేళ ఆ సంపన్నుణ్ణి చేసుకున్నా, వాళ్ళకున్నదంతా పోయి ఈ దశకే వస్తారు. ఇప్పుడున్నట్టుగా ఉండటానికి నాకేమీ అభ్యంతరంలేదు. నేను వెళ్ళను," అన్నది భార్య.



"వెళ్ళమని నిన్ను అజ్ఞాపిస్తున్నాను. తెలిసిందా?" అని ముసలాడు మరొకమాట అనకుండా వెళ్ళిపోయాడు.

మర్నాడు తెల్లవారుతూనే ఆమెకోసం తల్లి కాస్త మంచిబట్టలూ, పొరుగువాళ్ళ దగ్గిర అరువు తెచ్చిన పాదరక్షలూ తెచ్చి కూతుర్ని ముస్తాబు చేసింది. కాని వారు బయలుదేరబోయే సమయంలో ఒక బండీ వచ్చి గుడిసెముందు నిలిచింది. అందులో నుంచి ఇద్దరు స్త్రీలు దిగి గుడిసెలోకి వచ్చారు. వారు ఆ పిల్ల ధరించిన దుస్తులన్నీ ఊడదీసేసి అద్భుతమైన దుస్తులు తొడిగారు. ఆమె శరీరం నిండా కళ్లు చెదిరే రత్నాలు గల ఆభరణాలు తగిలించారు. ఆమె చేతి వేలికి పెద్ద వజ్రం గల ఉంగరం పెట్టారు. ఆమె ఇప్పుడు చూడటానికి స్వర్గలోకపు అప్సరసలాగున్నది. తరవాత వాళ్లు ఆమెనూ, ఆమె తల్లినీ బండిలో ఎక్కించుకుని పెళ్లి ఇంటికి వెళ్ళారు.

పెళ్లికూతురికి అందరూ కానుకలు చదివిస్తున్నారు. ముసలాడి భార్య తన చేతికి ఉన్న వజ్రపుటుంగరం తీసి పెళ్లికూతురికి ఇచ్చింది. అక్కడ చేరిన అమ్మలక్కలందరూ ఆ పిల్లను చూసి, "ఎవరీ మహారాణి?" అని గుసగుసలాడారు.

ఇంతలో పెళ్ళికూతుర్ని తీసుకుపోవటానికి పెళ్లికొడుకు వచ్చాడు; కట్టెలు కొట్టేవాడి కుమార్తెను చూసి అలాగే ఒక క్షణం పాటు స్తంభించిపోయాడు.

వాడి వాలకం చూసి పెళ్లికూతురికి ఒళ్లు మండిపోయింది. ఆమె తన బంధువులందరినీ పోగుచేసుకుని అప్పటికప్పుడే వెళ్ళిపోయింది. కట్టెలు కొట్టేవాడి కూతురును ఆమె వెంట వచ్చిన స్త్రీలు బండిలో ఎక్కించి గుడిసెవద్దకు తీసుకుపోయి, ఆమె ఒంటిపైన ఉన్న దుస్తులూ నగలూ తీసుకుని ఎప్పటి బట్టలు తొడిగి, బండి ఎక్కి వెళ్ళిపోయారు.




ఈలోపల పెళ్లికొడుకు తన మనుషులను బండి వెనకనే పంపి, తాను ప్రేమించిన పిల్ల ఒకప్పుడు తనకు ప్రధానమైన పిల్లేనని తెలుసుకుని, "నేను ఆమెను తప్ప మరెవరినీ చేసుకోను!" అని శపథంచేశాడు. తనను పెళ్లాడవలిసిందని కోరుతూ అతను పేదవాడి కుమార్తెకు రాయబారం పంపాడు.

"నేను ముసలాడి భార్యను. ఈ జన్మకు నా అదృష్టం ఇంతే. ఇంతకంటె ఎక్కువ అదృష్టాన్ని నేను కోరను!" అని ఆమె జవాబు చెప్పింది.

ఈ సమాధానం విని సంపన్నుల కొడుకు మండిపడ్డాడు. "నేను పెళ్ళాడతానంటే నిరాకరిస్తుందా? నా తాహతేమిటి, దాని తాహతేమిటి?" అంటూ వాడు సుల్తాను వద్దకు వెళ్ళి ఫిర్యాదుచేశాడు.

"నీ ఫిర్యాదు రేపు వింటాం!" అని సుల్తాను తెలియజేశాడు.

మర్నాడు దర్బారుకు హాజరుకమ్మని కట్టెలు కొట్టేవాడి కుమార్తెకు పిలుపు వచ్చింది. కారణం తెలియక ఆమె కంగారు పడింది. తీరా అక్కడికి వెళ్లినాక అక్కడ సంపన్నుల కొడుకు కనిపించాడు.

"ఈ పిల్లను ఒకప్పుడు నాకు ప్రధానం చేశారు. అందుచేత ఈమె నన్ను పెళ్లాడేటట్టు తీర్పు దయచేయించండి. లేదా

ఈమెకు శిరశ్ఛేదం విధించండి," అని సంపన్నుల కొడుకు తెరచాటున ఉన్న సుల్తానుకు విజ్ఞాపన చేసుకున్నాడు.

"నేను ఇతన్ని పెళ్ళాడను. కావలిస్తే నా తల తీసేయించండి. నేను అదివరకే ముసలాడి భార్యను అయాను," అన్నది కట్టెలు కొట్టేవాడి కూతురు.

"ఈ ముసలా డెవరు?" అని సుల్తాను తెర వెనకనుంచి అడిగాడు.

"నాకు తెలియదు. చీకటి పడేవేళ వచ్చి నాకు అయిదు రాగిడబ్బులూ, ఒక కొవ్వొత్తీ ఇచ్చి పోతూంటాడు!" అన్నదామె.

"అటువంటి వాడితో దారిద్ర్యం అనుభవించేకన్న ఈ సంపన్న యువకుణ్ణి ఎందుకు పెళ్ళి చేసుకోవు?" అని అడిగాడు సుల్తాను.

"నేను ముసలాడి భార్యగానే ఉంటాను. ఆయనే నాకు రాసిపెట్టిన మొగుడు!" అన్నదామె.

"నీ భర్త నీకు కనిపిస్తే గుర్తించగలవా?" అంటూ సుల్తాను తెరచాటు నుంచి ఇవతలికి వచ్చాడు. సుల్తాను యువకుడు. అయినప్పటికీ ఆమె తన భర్తను గుర్తించి, "మహారాజా, మీరే ఆ ముసలాడు! అదుగో మీ చెంపమీద గాటు!" అన్నది కట్టెలు కొట్టేవాడి కూతురు.

సుల్తాను నవ్వి, "అవును, నేనే ఆ ముసలాణ్ణి. తలవని తలంపుగా నా పాలపడిన నీ బుద్ధి ఎటువంటిదో తెలుసుకునేటందుకే నీకు పరీక్షలు పెట్టాను. ఈ ద్రోహి పెళ్ళికి నిన్ను అలంకరించి తీసుకుపోయిన స్త్రీలను నేనే పంపాను! నీ అందం ఎంత గొప్పదో, నీ బుద్ధికూడా అంత గొప్పది!" అన్నాడు.

ఆయన సంపన్నుల కొడుకును ఖైదులోకి తోయించి, కట్టెలు కొట్టేవాడి కూతురిని నిండు కొలువులో మళ్ళీ పెళ్ళాడాడు. నలభై రోజులపాటు దేశమంతటా విందులూ వినోదాలూ జరిగాయి.






తాతయ్య నిండువెన్నెలలో పడకకుర్చీ వాల్చి కూచుని, పొడుంకాయలో నుంచి ఎడమచేతిలోకి పొడుం వేసుకుంటూ ఒక శ్లోకం చదివాడు:

"మంత్రతః కార్యానుగో యేషాం,
కార్యం స్వామి హితానుగం;
త ఏవ మంత్రిణో రాజ్ఞాం
నతు యే గల పల్లవాః."

తాతయ్యచుట్టూ కూచున్న పిల్లలు, "అదేంశ్లోకం, తాతయ్యా? దాని అర్థమేమిటి, తాతయ్యా?" అని అడిగారు.

తాతయ్య తాపీగా కుడిచేతి వేళ్ళతో పొడుం పట్టు పట్టి పీల్చి, చెయ్యి విదిలిస్తూ, "అ శ్లోకానికి అర్థం ఏమిటంటారా? చెబుతా వినండి. మంత్రి అయినటువంటివాడు రాజుకు అనుకూలంగా ఉండి కార్యసాధన చెయ్యాలిగాని, అలా చేయలేనివాడు మంత్రే కాడూ అని దాని అర్థం," అన్నాడు.

"ఏం రాజు, తాతయ్యా?....మంత్రి ఎవరు, తాతయ్యా? ఆ కథ చెప్పు, తాతయ్యా!" అని పిల్లలు తలా ఒక మాటా అడిగారు.

"కథ చెప్పమనా మీరనేదీ? దానికేం? చెబుతా వినండి," అంటూ తాతయ్య ఈ కథ చెప్పాడు:

పూర్వం చక్రపురాన్ని సుదర్శన మహారాజు అనే ఆయన పాలించేవాడు. ఆయనకు బుద్ధిసింధుడనే మంత్రి ఉండేవాడు. ఈ మంత్రి ఉన్నాడే అతడు బహుగొప్ప బుద్ధిశాలి. అందుకే ఆయనను రాజుతో పాటు రాజ్యంలోని ప్రజలు కూడా ఎంతో మెచ్చుకునేవారు.

రాజుగారికి మటుకు ఒక వెర్రి ఉండేది. ఆయన అడ్డమైన జ్యోతిష్కులనూ పిలిచి భవిష్యత్తు తెలుసుకుంటూ ఉండేవాడు. ఇలా ఉండగా రాజుగారి కొలువుకు ఒక



రచన: సి. శేషాద్రి

జ్యోతిష్కుడు వచ్చి తన శక్తి గురించి రాజుగారికి గొప్పగా చెప్పుతున్నాడు. రాజుగారికి అతగాడిలో గురి కుదిరింది. ఆయన ఆ జ్యోతిష్కుడికి తన చక్రం చూపించి, "అయ్యా, నా ఆయుర్దాయం ఇంకా ఎంత ఉంది?" అని అడిగాడు.

దానికా జ్యోతిష్కుడు, "మహారాజా, ఈనాటినుంచి మరి ఆరు మాసాలతో మీ ఆయువు తీరిపోతుంది. నా దగ్గిర దాపరికం లేదు," అనేశాడు.

దాంతో రాజుగారికి మనోవ్యాధి పట్టుకుంది. ఆయన నిద్రాహారాలు మానేసి, మంచాన పడి, "అయ్యో, మరో ఆరుమాసాలతో నాకు కాలం తీరిపోతుందే!" అని బెంగతో కృశించసాగాడు.

ఇదంతాచూస్తున్న మంత్రికి జ్యోతిష్కుడిపైన కోపం వచ్చింది. ఆయన రాజుగారితో, "మహారాజా, మీరీ జ్యోతిష్కులను నమ్మకండి. వసిష్ఠుడంతటివాడు శ్రీరాముడి పట్టాభిషేకానికి ముహూర్తం పెడితే ఏమయింది? అదే ముహూర్తానికి రాముడు వనవాసం బయలుదేరటమే గాక తన భార్యను కూడా పోగొట్టుకున్నాడుగద!" అన్నాడు.

కాని రాజు మనోవ్యాధి నిమ్మళించలేదు. అప్పుడు మంత్రి ఏం చేశాడనుకున్నారు? జ్యోతిష్కుణ్ణి పిలిపించి, "ఏమయ్యా, రాజుగారి ఆయుఃప్రమాణం చెప్పావుగదా, మరి నీ ఆయుఃప్రమాణం మాట ఏమిటి?" అని అడిగాడు.

"చిత్తం, నేనింకా నలభైఏళ్ళు బతుకుతాను!" అన్నాడు జ్యోతిష్కుడు.

"అలాగా?" అంటూ మంత్రి ఆ జ్యోతిష్కుడికి అప్పటికప్పుడే మరణదండన విధించి శిరశ్ఛేదం చేయించాడు.

ఆ దెబ్బతో రాజుగారికి మనోవ్యాధి పోయింది. దాంతోబాటు జ్యోతిషంపిచ్చి కూడా పోయింది. ఆయన చాలాకాలం సుఖంగా రాజ్యంచేశాడు.



స్థల పురాణం: **6. కొండ్రెడ్డిపల్లి** బహుమతి పొందిన వ్యాసం

మా ఊరి పేరు కొండ్రెడ్డిపల్లి. ప్రతి సంవత్సరం మాఘశుద్ధ సప్తమినాడు మొదలుకొని పదిహేనురోజులు "జాతర" జరుగుతుంది. ఈ పుణ్యతీర్థానికి చంద్రాయుని జాతర అని పేరు. ఈ పేరు రావడానికి పూర్వం నిజంగా జరిగిన కథ ఒకటి వుంది. ప్రజలు ఈ గాథను చెప్పుకొని ఆశ్చర్యపోతుంటారు.

పూర్వం మా వూరిలో శరభయ్య అనే కర్షకుడు వ్యవసాయం చేసుకుంటూ వున్నాడు. అతని కొడుకు పేరు చంద్రాయుడు. శరభయ్య భార్య చనిపోయి చాలాకాలమైంది. కొంతకాలానికి వృద్ధాప్యంవల్ల శరభయ్య కూడా మరణించాడు. చంద్రాయుణ్ణి దగ్గర చేరదీసి ఆదరించేవారెవరూ లేనందున అతడు దొంగతనం వృత్తిగా చేసుకొని జీవించేవాడు. కొన్నాళ్ళకా చంద్రాయుడు కాస్తా గజదొంగగా మారి ప్రజలను నానా హింసలు పెట్టి డబ్బు లాగుతుండేవాడు.

ఒకనాడతడు దారివెంబడి పోవుచుండగా అతనికొక సాధువు కనబడెను. వెంటనే అతడు ఆ సాధువుపై పడబోగా, సాధువు అసలు సంగతి గ్రహించి, "నాయనా, నువ్వెందుకు ప్రజలను హింసించి, నరకంపాలవ్వుదవు? నీవు ఈ ఊరికి సమీపమున నున్న కొండపై తపస్సుచేసి బ్రహ్మను మెప్పించి, అతని దగ్గరున్న రథాన్ని కోరుకో. అప్పుడు నీ దారిద్ర్యం తీరిపోతుంది," అని చెప్పి వెళ్లిపోయాడు.

చంద్రాయుడు తక్షణమే పోయి, సాధువు చెప్పిన రీతిగా తపస్సు చేసి, బ్రహ్మను మెప్పించి, రథాన్ని తీసుకొని వచ్చుచుండగా, బ్రహ్మ అతనితో, "నీవు రథాన్ని తోలుకొనిపోవునపుడు వెనుదిరిగి చూడగూడదు; అట్లు నా మాట కాదని వెనుదిరిగి చూచితివా, నీవు శిలగా మారిపోతావు. రథ చక్రాలు పూడిపోతాయి," అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

చంద్రాయుడు సంతోషంతో రథాన్ని తోలుకొని వచ్చుచుండగా, అతనికి వెనుక ఎవరో వస్తున్నట్లు చప్పుడు కాగా, బ్రహ్మ చెప్పిన మాటలు మరచి, వెనుదిరిగి చూచేసరికి అతడు కాస్తా శిలగా మారిపోయాడు, రథ చక్రాలు పూడిపోయి కొండకు సమీపములో నున్న కోనేరులో ఒకటి, కోనేరుకు సమీపమునన్ను దేవాలయములో దేవుని వెనుక ఒకటి, పడి ఇప్పటికిని కన్పించుచున్నవి. అతడు రథమును తోలుకొని వచ్చుచుండగా కొండపై పడిన చక్రముల గుంటలు ఇప్పటికిని గలవు. అతడు శిలగా మారి కొండపైనే గలడు. అందువలన ఈ పుణ్య తీర్థానికి అతని పేరిట, "చంద్రాయుని జాతర" అని పేరొచ్చింది.

వి. సీతరామాచారి, కొండ్రెడ్డిపల్లి, మహబూబ్‌నగర్ జిల్లా.

[బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.]

మన దేశపు అద్భుతాలు :

# ఢిల్లీ ఎర్రకోట

మన దేశంలోని ప్రఖ్యాతమైన కట్టడాలలో ఢిల్లీ ఎర్రకోటను మించగలది లేదని చెప్ప వచ్చు. ఇది మొగలుల వైభవానికి శాశ్వత మైన చిహ్నం. మన దేశానికి వచ్చే యాత్రి కులు దీనిని చూడకుండా వెళ్ళరు.

దీనిని నిర్మించినవాడు - షాజహాన్. 1639 లో దీని నిర్మాణం ప్రారంభమయింది. మరి 9 ఏళ్ల అనంతరం షాజహాన్ ఇందులో గృహప్రవేశం చేశాడు. 1648 లో ఈ గృహ ప్రవేశం అత్యంత వైభవంగా జరిగిందట. అంతటా సిల్కుతోనూ, మఖమల్‌తోనూ చాందినీలు కట్టారట. దీవానీ ఆమ్ లోని సింహాసనంమీద బంగారు స్తంభాలపై అమర్చిన ప్రత్యేకమైన చాందినీ అంచులకు ముత్యాలు కూర్చారట. రాజులకూ, సామంతులకూ వెలలేని కానుకలు ఇచ్చారట. షాజహాన్ రాజభవనంలో అడుగు పెట్టినప్పుడు ఆయన శిరస్సుపై బంగారు, వెండి కాసులు అభిషేకం చేశారట.

షాజహాన్ ఈ ఎర్రకోటలో ఇంద్రభోగాలు అనుభవించాడు. దీవానీఖాస్‌పైన, "భూలోక స్వర్గమంటూ ఉంటే అదే ఇది, అదే ఇది, అదే ఇది," అని చెక్కి ఉన్న మాటలు అనాడు అక్షరాలా నిజమయాయి.



అయితే ఎర్రకోట మొగలులకు అచ్చి రాలేదని చెప్పాలి. దీని నిర్మాత అయిన షాజహాన్ తన కొడుకుకు బందీ అయి తన జీవిత శేషాన్ని ఆగ్రా కోటలో ఖైదీగా గడిపాడు. ఔరంగజేబు దక్కనులో యుద్ధాలు చేయటానికి వెళ్లి మరి తిరిగి రాలేదు. అయన కొడుకు షా ఆలం బహదుర్ షా తన జీవితమంతా యుద్ధ శిబిరాలలోని డేరాలలో గడిపి, చూరుకింద పడుకోవటం ఇష్టం లేక ఎర్రకోటలో అడుగు పెట్టనేలేదు.

ఎర్రకోటలోని వివిధ భవనాలను కలుపుతూ, ఆ కాలంలో, ఆర్చీలతో కూడిన నడవలూ, ఇళ్ళమధ్యన తోటలూ, పారే నీటి కాలవలూ, అద్భుతమైన గృహాలంకరణలూ కలిగి అది భూలోకస్వర్గంగానే ఉండేది.

ఎర్రకోటకు రెండు ముఖద్వారాలున్నాయి. యాత్రికులు పశ్చిమద్వారం గుండా లోపలికి ప్రవేశిస్తారు. దీనికి లాహోర్ ద్వారం అని పేరు. ఇది చాందినీ చౌక్‌కు ఎదురుగా ఉంటుంది.

అసలు రాజభవనం యొక్క ముఖద్వారంలో నకర్ ఖానా ఉన్నది. ఇది మలిచిన ఇసుకరాతితో కట్టిన కుదిమట్టమైన భవనం. దీనికి ఎదురుగా "పచ్చిగడ్డి తివాసీ" (లాన్) ఉన్నది. దాని అవతల దీవానీ ఆమ్ (బహిరంగ సభ, లేక దర్బారు) ఉన్నది. సామాన్య ప్రజలు పచ్చిక తివాసీ మీద కూచునేవారు. ఒక్కొక్కప్పుడు దీని పైన చాందినీలు కూడా కట్టేవారు. గొప్పవాళ్ళకు మాత్రమే దర్బారు భవనంలోకి ప్రవేశం ఉండేది.



దర్బారు భవనం తూర్పుభాగంలో ఎత్తయిన వేదికా, దానిపై సింహాసనమూ ఉండేవి. సింహాసనానికి ఎదురుగా పెద్ద వజీరుగారికి చలవరాతి ఆసనం ఉండేది. దీవానీ ఆమ్‌ను అనుకుని వెనుకగా ఉన్న మండపానికి రంగ్ మహల్ అని పేరు. ఇక్కడ రాజకుటుంబానికి చెందిన స్త్రీలు కూర్చునేవారులాగుంది. ఈ మండపం నడుమ ఒక చలవరాతి కుండం ఉన్నది. దీని అడుగుభాగం అందంగా పద్మంవలె మలిచి ఉన్నది. రాజ భవనం ఒక చివర నుంచి మరొక చివరకు ఉండే నీటి కాలువ ఈ కుండం గుండా పోతుంది.

రంగమహలుకు దక్షిణంగా మరొక మండపం ఉన్నది. దీన్ని ముంతాజ్ మహల్ లేక శీష్ మహల్ అంటారు. ఇప్పుడిక్కడ ఒక మ్యూజియం ఉన్నది; ఇందులో మొగలుల నాటి స్మారక వస్తువులు చాలా ఉన్నాయి. ఇది చూడదగినది.

రంగమహలుకు ఉత్తరంగా "మహలీ ఖాస్" ఉన్నది. ఇది చక్రవర్తి స్వంత భవనం. ఇందులో చక్రవర్తి పని చూసుకునేటందుకూ, శయనించటానికీ, ప్రార్థనలు చేసుకోవటానికీ మూడు విభాగాలున్నాయి. ఈనాటికీ ఇవి ఎంతో మనోహరంగా ఉన్నాయి.

ఖాస్ మహల్‌ను ఆనుకుని ఒక ఎనిమిది పలకల బురుజున్నది. చక్రవర్తి ఈ బురుజుపైనుంచి, బయటి మైదానంపై చేరిన పౌరులకు దర్శనమిచ్చేవాడు. చక్రవర్తీ, ఆయన కుమారులూ ఇక్కడినుండి మైదానంపై జరిగే ఏనుగుల పోరాటాలూ, ఇతర వినోదాలూ చూసేవారు.

ఇంకా ఉత్తరంగా పోతే దీవానీ ఖాస్ (అంతరంగిక దర్బారు) భవనం ఉన్నది. చక్రవర్తి తన మంత్రులతోనూ, అధికారులతోనూ ఇక్కడ మంతనాలు జరిపేవాడు. జగత్ప్రసిద్ధమైన నెమలి సింహాసనం, అనేక రత్నాలు తాపినది, ఇక్కడే ఉండేది,

దీవానీ ఖాస్‌కు ఉత్తరంగా రాజకుటుంబంవారి స్నానశాలలున్నాయి. మన దేశంలో ఎక్కడా ఇంత అందమైన మొగలు స్నానశాలలు కానరావు. ఇక్కడ కనిపించే చలవరాతి చెక్కడపు పనులు అత్యంత మనోహరమైనవి. ఎర్రకోటలోని అన్ని కట్టడాలకన్న కూడా చెక్కుచెదరక పూర్వ శోభతో రాణించేవి ఈ స్నానశాలలే.

స్నానశాలలకు సమీపంలోనే మోతీ మసీదున్నది. దీనిని ఔరంగజేబు తన కోసమూ, తన స్త్రీజనం కోసమూ కట్టించాడు. ఇది చలవరాతితో కట్టినది.

మోతీ మసీదుకు అవతలగా ఒక పూలతోటా, కొలనూ, వాటికి రెండువైపులా చలవరాతి మండపాలూ ఉన్నాయి. ఈ మండపాలలో ఒకదాని పేరు శ్రావణం, రెండవదాని పేరు భాద్రపదం! తోట నట్టనడుమ రెండవ బహదుర్ షా గత శతాబ్దంలో ఒక ఇసుక రాతి కట్టడం కట్టించాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1961 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబర్ నెల 10-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నింగి మబ్బులు గప్పె

రెండవ ఫోటో : నెమలి పింఛము విప్పె

పంపినవారు : మా. అప్పారావు,

గోపాలపురం P. O., కొవ్వూరు తా॥- (ప॥ గోదావరి జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# ప్రశ్నోత్తరాలు

CHITRA

1. వి. రామకృష్ణారావు, ఉనకరమిల్లి

భారత కథ ప్రతి నెల బొమ్మముందు విఘ్నేశ్వరుడు మరియొక ముని యుంటున్నది. దీని భావమేమి, అన్నయ్యా?

ఆ ముని భారతం రచించిన వేదవ్యాసుడు. వేదవ్యాసుడు భారతం చెబుతుంటే విఘ్నేశ్వరుడు రాశాడని చెబుతారు.

2. డి. అన్నపూర్ణ, కొత్తపేట

అన్నయ్యా! మేము ఏదైనా కథ పంపిస్తే "చందమామ"లో ముద్రిస్తారా?

"చందమామ"లో ముద్రించదగిన కథలు పంపితే తప్పక ముద్రిస్తాము.

3. బచ్చు వీర్రాజు, ముక్కామల

"చందమామ" కార్యాలయంలో చిత్రకారు లెంతమంది ఉన్నారు?

చిత్రా, శంకర్, ఎం. టి. వి. ఆచార్య, ఇటీవలనుంచి వడ్డాది పాపయ్య.

4. పి. వి. రమణ, మునగపాక

అన్నయ్యా? అభిమన్యుని భార్య ఉత్తరా? లేక శశిరేఖా?

ఉత్తరే. శశిరేఖ ఎక్కడినుంచి వచ్చిందో తెలియదు. బలరాముడికి శశిరేఖ అనే కుమార్తెకూడా లేదు.

5. మయాచారి శ్రీరాములు, ఖిల్లాఘణాపురం

"మన దేశపు అద్భుతాలు"లో మహాబలిపురమును గూర్చి ప్రచురించారా?

మార్చి 1960 సంచికలో ప్రచురించాం.

6. వి. కె. జలఉష, గుత్తి

"చందమామ"కు కథలు పంపేటప్పుడు బొమ్మలుకూడా మేమే వేయవలెనా?

అవసరం లేదు. మంచి కథలు పంపటం మీ వంతూ, మంచి బొమ్మలు వేయించటం మా వంతూ.

7. *కె. ఇందిర, బొంబాయి*

**చంద్రమండలంలో మంచుకొండలు, సూర్యకిరణాలు ప్రసరించటం వున్నదిగదా! ఋతువులుగూడా ఉంటాయా?**

చంద్రుడిలోని కొండలపై మంచు లేదు. చంద్రుడిలో గాలీ, నీరూ ఉన్నట్టు ఆధారాలు కనపడవు. అందుచేత మనం అనుకునే ఋతువులు అక్కడ ఉండే అవకాశం లేదు.

8. *"కాజశ్రీ", విజయవాడ*

**"రత్నావళి" [దీపావళి సంచిక]లో చిత్రించిన బొమ్మలు అన్ని బొమ్మలు లాగా లేవు, కారణం?**

"చందమామ"లో మిగిలిన బొమ్మలు లైన్ డ్రాయింగులనుంచి లైన్ బ్లాక్‌లు తీసి అచ్చువేసినవి; "రత్నావళి" తాలూకు బొమ్మలు వాష్ డ్రాయింగులనుండి హాఫ్‌టోన్ బ్లాకులు తయారుచేసి అచ్చువేసినవి.

9. *జి. ఎస్. ఏ. హుస్సేన్, విజయవాడ*

**హిందీ "చందమామ"లో వెలువడుచున్న కథలు తెలుగు "చందమామ" లోనివా, లేక వేరే కథలా?**

వేరే కథలు కావు. తెలుగు "చందమామ"లోని కథలే ఒక నెల అనంతరం హిందీ "చందమామ"లో వెలువడతాయి.

10. *చెన్నూరి కమలాకర్, బెల్లంపల్లి*

**అన్నయ్యా, "చందమామ" నెలకు రెండుసార్లు ప్రచురించిన బాగుండునని నా అభిప్రాయము....**

ఇప్పుడున్న ముద్రణసౌకర్యాలతో "చందమామ" అచ్చుకావటానికి పూర్తిగా నెల పట్టుతున్నది. నెలకు రెండు "చందమామ"లు ఎలా తేగలం?

11. *ఆర్. లక్ష్మి, తుని*

**చంబారాజుకు ["మార్కోపోలో"] ఎందరో భార్యలు, 326 మంది పిల్లలు అన్నారుకదా, ఇది నమ్మశక్యము కాకున్నది. 326 మంది పిల్లలు పుట్టేసరికి ఆ రాజు ఇంకా బతికే ఉన్నాడా?**

ఎందరో భార్యలున్నారుగదా, అందరూ కలిసి కన్న పిల్లల సంఖ్య 326. ఇందులో నమ్మశక్యం గానిదేమీ లేదే?

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు తోటలో ఆడుకుంటూ వుండగా, వాళ్ళ 'టైగర్'ను పట్టుకునేందుకు, ఒక కొంటె కుర్రాడూ, గొర్రెలుకాచే కుర్రాడూ కలిసి ఎత్తు వేశారు. గొర్రెలుకాచే కుర్రాడు ఉచ్చు వేసిన తాడు తీసుకుని పొదల చాటున పొంచి వుండగా, కొంటె కుర్రాడు 'టైగర్'ను వాడు దాగివున్న వైపుకు తరమ సాగాడు. తీరా 'టైగర్', కొంటె కుర్రాడూ ఆ దాపులకు వచ్చేసరికి, గొర్రెలు కాచే కుర్రాడు విసిరిన తాడు 'టైగర్' మెడకు పడేబదులు, కొంటె కుర్రాడి కాలుకు పడి వుచ్చు బిగుసుకుపోవటంతో, వాడు నేలమీద బోర్లపడ్డాడు. ఈలోపల 'టైగర్' పారిపోయింది. దాసూ, వాసూలు విరగబడి నవ్వారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



తేలికగా, చల్లగా, సౌకర్యంగా
రంగు దిగకుండా వుండే ఈ

# బిన్నీవారి
# టస్సూరులు

ప్రతినిత్యం ధరించడానికి
ఆదర్శమైనవి



దిట్టంగా చాలాకాలం రంగుపోకుండా మన్నే బిన్నీవారి టస్సూరులు ఎంత మొరటుగా వాడినా కొత్తగా జలజల్లాడుతూనే ఉంటాయి. ఇంట్లో ఉతుక్కొని ఇస్త్రీ చేసుకోవచ్చు. చాకలి ఖర్చు తగ్గించుకోవచ్చు.

**BINNY-**
**a great name in textiles**

బిన్నీ- బట్టలకు పేరుబడ్డది



బకింగ్‌హామ్ & కర్నాటిక్ కంపెనీ లిమిటెడ్
బెంగుళూరు ఉలెన్, కాటన్ & శిల్కు మిల్స్ కంపెనీ లిమిటెడ్
మ్యానేజింగ్ ఏజెంట్లు : బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్



## మానవుని విశ్వాసం

ఆశ నిలిపే, ఆస్థగొలిపే విశ్వాసం — నవ జగజ్జయభేరి మ్రోయించే,
తివిరి యినుమున తైలం తీయించే విశ్వాసం. మేలు కొలిపే మేలు నలిపే విశ్వాసం
— విధాత వైతాళికమై విదులెరిగించే, శుభార్థ సంసాధకమై వ్యథ
మరపించే విశ్వాసం. చాలు నడిపే రాలు మ్రలచే విశ్వాసం — ఎడారిలో ఘన
సస్యం విరియించే జడాంబువుల నవశక్తులు కెరలించే విశ్వాసం.,
ఆ అర్థం పరమార్థం, ఆ రూపం రేపటి లోకం. అవకాశాల్లా హర్షధ్వనులా
నిండిన లోకం. ఈ పరిణామంలో ...

నేడూ, నిన్నటివలెనే, మా ఉత్పత్తులు మీ గృహాల శుభ్రతకీ, ఆరోగ్యానికీ,
ఆనందానికీ ఉపకరిస్తాయి. పైగా మా నేటి కృషికి మరొక లక్ష్యం ....
రేపు - రేపటి మీ పెరిగే జీవన ప్రమాణాలతో పెరిగే అవసరాలను తృప్తిపరచటం.
అందుకై మేము విస్తృత సేవా సౌకర్యాలతో, కొత్త కొత్త ఊహలతో,
కొత్త కొత్త ఉత్పత్తులతో తయారుగా వుంటాము.

**నేడూ, రేపూ హిందుస్థాన్ లీవర్ గృహములకు సేవ చేయుచున్నది**

PR.6-50 TL

# లిటిల్స్
# ఓరియంటల్
# బామ్




డెబ్బయి అయిదు సంవత్సరాలకుపైగా, సమస్తమైన జలుబులను, పోటులను, నొప్పులను నివారించుటలో నమ్మకమైన మందు.

LOB-509




లిటిల్స్ ఓరియంటల్ బామ్ అండ్ ఫార్మక్యూటికల్స్ లిమిటెడ్,
ఎక్స్‌ప్రెస్ ఎస్టేట్స్, మద్రాసు-2.

---



ఆధునిక విజ్ఞానం మరియు
బాహుళ్యమైన అనుభవం
ఈ రెండింటి సమ్మిళితం

# లోమ

REGD.



సంపూర్ణ శిరోజ పోషకము మరియు శిరోజాలను నలుపు చేయునది మనోహర సువాసన గలది



లోమ, ఆధునిక విజ్ఞానం మరియు బాహుళ్యమైన అనుభవం, ఈ రెండింటి సమ్మిళితమైన అత్యధిక పరిశోధన యొక్క ఉత్పత్తి. ఇదే దాని విజయవంతమైన ఫలితమునకు రహస్యం.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ అండ్ ఎక్స్‌పోర్టర్స్:
ఎం. ఎం. ఖంబాట్‌వాలా,
అహ్మదాబాద్-1

TEL

ప్రతి సోమవారం రాత్రి 8-30 గం॥లకు సిలోన్ రేడియోమీద "లోమా సంగీత్ ఖజానా" వినండి.



బహుమతి
పొందిన వ్యాఖ్య

నెమ్మలి పిం[illegible]ము విప్పె[illegible]

పంపినవారు :
ఎం. అప్పారావు-గోపాలపురం

